Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు • స్థాపితం: 1930 • జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 31 • 5-8-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# తెలంగాణ ఇవ్వక తప్పేట్లు లేదు!

రాష్ట్రంలో అనిశ్చిత స్థితి నిరంతరాయంగా, నిరవధికంగా కొనసాగిపోతూనే వుంది. అటు ముఖ్యమంత్రి ఇటు ప్రతిపక్ష నాయకులు కూడా నిష్క్రియాపరత్వంతో సతమతమౌతున్నారు. చేయడానికి పని లేదు. మాట్లాడడానికి అంశం లేదు. పాల్గొనడానికి కార్యక్రమం లేదు. అంతా నిరామయ పరిస్థితి. మంత్రులు ముఖ్యమంత్రి మాట వినడం లేదు. అధికారులు మంత్రులను లెక్క చేయడం లేదు. దాదాపు సగం మంత్రివర్గమే లేదు. తెలంగాణ మంత్రుల రాజీనామాల వల్ల సచివాలయం బోసి పోతున్నది. తమకు అవసరమైనవి, లాభం కల్గించేవి అనుకొన్న ఫైళ్లను మాత్రం ఇళ్ల వద్దకు తెప్పించుకొని సంతకాలు పెడుతున్నారు. సాధారణ ఫైళ్లన్నీ కట్టలు కట్టలుగా పేరుకొని పోయి, దుమ్ము కొట్టుకొంటున్నాయి. పంచాయితీరాజ్, ఇరిగేషన్, పౌర సరఫరాలు, సమాచారం, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, ఉన్నత విద్య, చివరకు హోం వంటి కీలక శాఖలన్నీ స్థంభించిపోయి వున్నాయి. ప్రభుత్వానికి పక్షవాత రోగం వచ్చినట్లుంది పరిస్థితి.

## ప్రతిపక్షంలోనూ నిస్తేజం!

ప్రభుత్వం ఇంతగా చేష్టలుడిగిన పరిస్థితులు ప్రతిపక్షానికి వరప్రసాదం వలె ఉపయోగపడాలి. కానీ చంద్రబాబు కూడా కిరణ్‌కుమార్ రెడ్డి వలెనే గోళ్లు గిల్లుకొంటూ కాలక్షేపం చేస్తున్నాడు. ప్రభుత్వ వైఫల్యాలను ఎండగడుతూ జనంలోకి వెళ్లే అవకాశం ఆయనకు చిక్కడం లేదు. ఏది మాట్లాడితే ఏ తంటా వస్తుందో అన్న భయంతో ఏమీ మాట్లాడకుండా కాలం వెళ్లదీస్తున్నారు.

ఈ నిరామయ పరిస్థితులకు కారణం – తెలంగాణ వివాదం. అన్ని రాజకీయ పార్టీలు ఆ చక్ర బంధంలో ఇరుక్కొని, బయటపడలేక గిలగిల కొట్టుకొంటున్నాయి. విలవిల లాడి పోతున్నాయి. మంత్రులు,

కొరవ 14వ పేజీలో

# అవినీతిపై సమరం

రాజకీయ అవినీతి నిర్మూలనకు ప్రజా సంఘాలు చేస్తున్న కృషి, ప్రజలలో వెల్లి విరుస్తున్న చైతన్యం అబ్బురం కల్గిస్తున్నాయి. ఈ చెద పురుగు ఈ రోజు కొత్తగా పుట్టింది కాదు. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన పక్క క్షణంలోనే ఇది కూడా పురుడు పోసుకొన్నది. ఆనాటి నుంచి రాజకీయాలకు అదొక ఆభరణంగా భాసిస్తున్నది. రాజకీయ నాయకులు ఎంత సంపాదిస్తే అంత గొప్పవారిగా కీర్తింపబడుతున్నారు. వందలు, వేల కోట్లు మూట కట్టుకొన్న వారికి జనం బ్రహ్మరథం పట్టడం ఆనవాయితీగా మారింది. పంచాయితీ సర్పంచ్ నుంచి ప్రధాన మంత్రి వరకు ఇదే పోకడ. డబ్బున్న వాడికి మాత్రమే ఎన్నికలలో గెలుపు అవకాశాలు కలుగుతుండడంతో, అటు నాయకులు, ఇటు ప్రజలు కూడా అవినీతి అనేది రాజకీయాలలో ఒక తప్పనిసరి భాగంగా భావిస్తున్నారు. మన్నిస్తున్నారు. అవినీతిపరులుగా ముద్రపడిన వారికి ఓట్లు క్రుమ్మరిస్తున్నారు. దానితో అవినీతితో ఇంకా ఎక్కువ సంపాదించి, ఇంకా ఎక్కువగా ఓట్లను కొనుగోలు చేస్తే తప్ప రాజకీయాలలో నిలవలేమనే అభిప్రాయం అందరిలో బలపడిపోయింది. దానితో రాజకీయ అవినీతి వెయ్యి పడగల విష నాగు వలె జాతి సౌభాగ్యాన్ని కాటు వేసే దశకు చేరుకొన్నది.

అత్యంత విషాదకరమైన ఈ వాతావరణంలో ఒక శుభ పరిణామం – రాజకీయ అవినీతిపై ప్రజా సంఘాలు, సంఘ సేవకులు యుద్ధం ప్రకటించడం. దానిపట్ల ప్రజలలో అనూహిత చైతన్యం ప్రబలడం. స్వాతంత్ర్యం వచ్చిన ఇన్నేళ్ల తర్వాత, మన దేశ ప్రజలు మొదటిసారిగా రాజకీయ అవినీతిని సహించబోమని నిక్కచ్చిగా చెప్తున్నారు. అవినీతికి పాల్పడిన వారిని చట్టం చెరలో బిగించమని గట్టిగా కోరుతున్నారు. స్వతంత్ర భారత చరిత్రలో మొదటిసారిగా మధుకోడా వంటి ముఖ్యమంత్రులు, ఎ.రాజా వంటి కేంద్ర మంత్రులు, కనిమొళి వంటి జాతీయ నేతల కుటుంబ సభ్యులు, సత్యం, రిలయన్స్ వంటి కార్పొరేట్ సంస్థల పెత్తందారులు జైలులో ఊచలు లెక్క పెడుతున్నారు. 2జి స్కాం, కామన్‌వెల్త్ గేమ్స్, ఆదర్శ్ హౌసింగ్ సొసైటి, బళ్లారి గనుల దోపిడి, జగన్ అక్రమ ఆస్తులు... ఇట్లా ఒకదాని వెంట మరొకటిగా అవినీతి కుంభకోణాలు న్యాయ పరిశీలనకు వస్తున్నాయి. అవినీతికి పాల్పడిన రాజకీయవాది చట్టాన్ని తప్పించుకోలేడనే సందేశాన్ని పరివ్యాప్తం చేస్తున్నాయి. ఒకరకంగా చెప్పాలంటే మన దేశంలో నడుస్తున్న ద్వితీయ స్వాతంత్ర్య సమరమిది. ఇక్కడ పోరాటం దేశాన్ని వలస రాజ్యంగా మలచిన విదేశీ శక్తుల మీద కాదు. దేశ సౌభాగ్యమనే కల్పవృక్షం మూలాలను పీల్చి పిప్పి చేస్తున్న మన స్వంత నేతల మీద.

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కపాడియా దీనికి అంకురార్పణ చేశారు. 2జి స్కాం నిందితుల విషయంలో సుప్రీంకోర్టు అవలంబించిన కఠిన వైఖరి దేశంలో అవినీతిపరులను చట్టానికి పట్టి ఇవ్వాలనే కోరిక వున్న ప్రతి ఒక్కరిలో కొత్త ఉత్సాహాన్ని, విశ్వాసాన్ని కల్పించింది. దాని వెంటనే అన్నా హజారే ప్రారంభించిన లోక్‌పాల్ బిల్లు ఆందోళన దీనికొక ఉద్యమం రూపం కల్పించింది. అదొక ప్రవాహం వలె సాగి పోతున్నది. ఈ ద్వితీయ స్వాతంత్ర్య సమరం సఫలం కావాలంటే, ప్రభుత్వం నుంచి పూర్తి సహకారం కావాలి. కొన్ని చట్టాలలో సంస్కరణలు తేవాలి. వాటిలో మొదటిది – అక్రమ ఆస్తులను జప్తు చేసే అధికారం. అవినీతి సొత్తుతో ఆర్జించిన ఆస్తులన్నిటినీ, అవి బినామీ పేర్లతో వున్నప్పటికీ స్వాధీనం చేసుకొనే చట్టం రావాలి. బినామీ నిర్ణయం పక్కాగా జరగాలి. ఎసిబి దాడులలో చిక్కిన అధికారుల డబ్బు, ఆస్తులను అవి తాము సక్రమంగా సంపాదించినవని, పన్నులు కట్టినవని నిరూపించుకొనే బాధ్యతను ఆ అవినీతిపరుల మీదనే పెట్టాలి. అంత వరకు వాటిని ప్రభుత్వం తన ఆధీనంలో వుంచుకోవాలి. అవినీతి కుంభకోణాలు వెలికి తీసే, దాడులు చేసే అధికారులు, ప్రజా సంఘాలకు ప్రభుత్వం పూర్తి రక్షణ కల్పించాలి. అటువంటి అధికారులను బదలీ చేయకుండా, వేధించకుండా చట్టపరమైన భద్రత కల్పించాలి.

బళ్లారి గనుల దోపిడీలో గాలి జనార్ధనరెడ్డి సోదరులు, కర్నాటక ముఖ్యమంత్రులు పాల్పడిన దురాగతాలను ఎంతో శ్రమించి వెలికి తీసిన కర్నాటక లోకాయుక్త సంతోష్ హెగ్డే వంటి వారిని ఇటు ప్రజలు, అటు ప్రభుత్వం కూడా అత్యున్నత పురస్కారాలతో సత్కరించవలసిన అవసరం వుంది. అటువంటి చర్యలు మరెందరో సంతోష్ హెగ్డేలు ముందుకు వచ్చే ప్రోత్సాహం కల్పిస్తాయి.

## జనవాణి

### ముఖ్యమంత్రి అభినందనీయుడు!

నెల్లూరు పర్యటనకు వచ్చిన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి జిల్లా ప్రజలు ఎన్నో రోజుల నుంచి కోరుతున్న పలు కోర్కెలను తీరుస్తానని హామీ ఇవ్వడం సంతోషించవలసిన విషయం. ఆయన రెండువేల కోట్ల రూపాయల విలువైన వాగ్దానాలు చేశారు. వీటిలో కొన్నింటిని నెరవేర్చను సాంకేతికంగా ఇబ్బందులు రావచ్చు. కాని ప్రభుత్వపరంగా మెడికల్ కాలేజి స్థాపనకు ఎటువంటి ఇబ్బందులు లేవు. ప్రాథమికంగా చేయాల్సిన కొన్ని చర్యలు చేపట్టి మెడికల్ కాలేజికి కూడా ముఖ్యమంత్రి చేత శంకుస్థాపన చేయించను నెల్లూరు నేతలు నడుంబిగించాల్సి వుంది.

పి.అరుణకుమారి — నెల్లూరు

### ఒకసారి ఆలోచించండి!

ఈ మధ్య పత్రికల్లో చూస్తున్నాను ప్రత్యేక మహిళా బ్యాంకులు ఏర్పాటు చేయబోతున్నారని. మంచి ఆలోచనే. ఈ సందర్భంలో పాత జ్ఞాపకం గుర్తుకు వచ్చింది. వెంకటగిరిలో కొంతకాలం క్రితం ఒక మహిళా బ్యాంకును ఏర్పాటు చేశారు. దీనికిగాను మండల పరిషత్తు గ్రాంటు నుంచి ఒక భవనాన్ని కూడా నిర్మించారు. లక్ష రూపాయల మూలధనంతో బ్యాంకు ప్రారంభించి ఇద్దరు మహిళలను వుద్యోగినులుగా నియమించారు. వారు ఏం చేశారో ఏమో? కొన్ని నెలలకు బ్యాంకు మూతబడింది. వుద్యోగినులు లేరు. పైసల పత్తా లేదు. ఈ బ్యాంకు గుర్చి అనుకొనే వారు లేరు. వెంకటగిరిలో ఏర్పాటు చేసిన మహిళా బ్యాంకుకు పట్టిన గతి ఇతర బ్యాంకులకు పట్టకుండా చూడాలి.

పి.సత్యనారాయణ జెట్టి — వెంకటగిరి

### దొరల పోకడ బయటపడింది!

ఢిల్లీలోని ఆంధ్రప్రదేశ్ భవన్‌లో పనిచేసే వుద్యోగిపై కెసిఆర్ మేనల్లుడు ఎమ్మెల్యే హరీష్‌రావు అకారణంగా దాడి చేయడం గర్హనీయం. ఈ దాడితో వారిలోని దొరల పోకడ బయటపడింది. తెలంగాణ ఐకాస అధ్యక్షుడు ప్రొఫెసర్ కోదండరామ్ 'రెడ్డి' ఈ దాడి విషయమై నోరెత్తకపోవడం ఆయనలోని దురహంకారాన్ని బయట పెట్టింది. దాడి విషయమై హరీష్‌రావును అరెస్ట్ చేయను పోలీసులు మీనమేషాలు లెక్కించడం బాధాకరం.

కె.పెంచలయ్య — కొడవలూరు

### రాజీనామాలు ఆమోదించాల్సింది!

తెలంగాణ ప్రజాప్రతినిధులు తమ పదవులకు చేసిన రాజీనామాలను స్పీకర్ నాదెండ్ల మనోహర్ తిరస్కరించారు. భావోద్వేగంలో ప్రజాప్రతినిధులు రాజీనామా చేశారని ఆయన అభిప్రాయపడ్డారు. స్పీకర్ నిర్ణయాన్ని ప్రజాప్రతి

కొరవ 14వ పేజీలో

---

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**8-8-1941**
**పేజీలు : 10 వెల: అణా**

### రవీంద్రుని అస్తమయం

నిన్న మధ్యాహ్నం ప్రపంచమంతయును నశ్రుధారలు విడుచుచుండ రవీంద్రుడు భౌతిక శరీరము చాలించెను. తమ యందు లీనమైనని పంచభూతములు మురియవచ్చును. తనను కౌగిలింప వచ్చినాదని కీర్తికాంత ఆనందించవచ్చును. భౌతిక కేంద్రమును వదలి యశోచంద్రికలు సకల విశ్వమును నిరభ్యంతరముగ ప్రసరించవచ్చును. తన మనుగడ గుర్చి ఏలాటి ఆటంకములిక నుండజాలవని శాశ్వత మూర్తి మత్వమైన కవీంద్రుని దివ్యతేజము సంతసింపవచ్చును.

చక్రవర్తులు జనింపవచ్చు. యుద్ధాధి దేవతలు దయింపవచ్చు. రాజనీతి కోవిదులు విరాజిల్లవచ్చు; శాస్త్ర పారంగతులుండవచ్చు; కానీ అందరూ ఒకటి, అగస్త్యుడొకటి అని ఆర్యోక్తి. అందరూ ఒకటి, రవీంద్రుడు ఒకటి. కాలగర్భమున నన్నియును మాయమగును. మానవునిచే మరువబడును; కానీ విజ్ఞాన తేజమట్టిది గాదు. దానిని అడ్డుపెట్టువారు లేరు. విద్యగల వానికెందునూ వింత లేదన్నాడు కవిపుంగవుడొకడు. త్రికాలవేత్త కవీశ్వరుడు, సర్వకాల జ్యోతి కనుక కవీశ్వరునకు మరణము లేదు. వ్యక్తిగత భౌతిక కళేబరము అదృశ్యము కావచ్చు. రవీంద్రునికి మరణ మెక్కడిది? ఏ రూపమున మనము రవీంద్రుని పరిచయము చేసుకొంటిమో, ఆ రూపమునకు ఏ నాటికీ చలనము లేదు.

### యానాది హాస్టల్‌కు రాజేంద్రుని విరాళం

నెల్లూరు యానాది హాస్టల్‌కు రాష్ట్రపతి బాబు రాజేంద్రప్రసాద్ 250 రూపాయలు విరాళం పంపారట.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**4-8-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరు ముచ్చట్లు

### పన్నుల హెచ్చింపు

నూటికి రూ 2–25లు వుండిన డ్రెయినేజి పన్నును రూ 4లకు; రూ 2లుగా వుండిన కుళాయి పన్నును రూ 4లకు హెచ్చిస్తూ గత 31వ తేది వైస్ ఛైర్మన్ పేరూరు లక్ష్మణగుప్త గారి అధ్యక్షతన జరిగిన నెల్లూరు మునిసిపల్ కౌన్సిల్ సమావేశంలో తీర్మానించబడింది. ప్రతిపక్ష సభ్యులు 7మంది డ్రెయినేజి పన్నుకు వ్యతిరేకంగా ఓటుచేశారు; కుళాయి పన్నుకు తటస్థులుగా వుండినారు. డ్రెయినేజి పన్ను హెచ్చింపు తీర్మానాన్ని కౌన్సిల్ 30–5–55లోనే చేసి వుండినది. దానిని పునరుద్ధరించి, ఈ అర్ధ సంవత్సరం నుండి అమలుకు తేవడమే ప్రస్తుత తీర్మాన ఉద్దేశ్యమట. దాదాపు కోటి రూపాయలకు పైగా ఖర్చుకాగల ఈ రెండు స్కీముల కొరకు చేయవలసి వచ్చే అప్పు తీర్చుటకు ఈ క్రొత్త పన్నుల విధింపు జరిగింది.

### బస్టాండు కొట్లాట

బస్సుల రాకపోకల వేళల తకరాదులో 3వ తేది ఉదయం కపాడిపాళెంలో రెండు వర్గాల మధ్య ఉత్తర బస్టాండులో కొట్లాట జరిగి, రాయపు శౌరి, రాయపు రాయలు సోదరులు గాయపరుచబడి, నెల్లూరు పెద్దాసుపత్రిలో చికిత్స పొందుతున్నారు. వీరిరువురిలో ఒకరికి కత్తిపోటు గూడానట. ఈ సందర్భంలో ఇప్పటికి అరెస్టులేమీ జరిగినట్లు లేదు. ఈ బస్టాండులో ఇలాంటి కొట్లాటలు, జేబి దొంగతనాలు నిత్యం విపరీతంగా జరుగుతున్నవి. బస్సుల రాకపోకల వేళలను గమనించడం కానీ, స్టాండ్‌లో ట్రాఫిక్ కంట్రోల్ చేయడం కానీ జరగడం లేదు. ఇక్కడుండే కానిస్టేబుల్ బేద డబ్బులు తీసుకోవడమేగానీ రాకపోకలు క్రమపరచడు.

# నెల్లూరు ముచ్చట్లు

విశ్వకుడు

## డాక్టర్ బెజవాడ గోపాల్‌రెడ్డి అవార్డు

ఉత్తరప్రదేశ్ మాజీ గవర్నర్, సాహితీవేత్త డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి స్మారకంగా 1998 నుంచి ప్రదానం చేస్తున్న అవార్డును ఈ యేడాది పారి శ్రామికవేత్త, సమాజ సేవాపరాయణి వి.ఎల్ ఇందిరాదత్‌కు ఇస్తున్నారు. 7వ తేది టౌన్‌హాల్‌లో జరిగే సభలో ఈ అవార్డును ప్రదానం చేస్తారు. బిజెపి జాతీయ నాయకులు ఎం.వెంకయ్యా నాయుడు, రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ఎమ్మెల్యేలు వివేకా నందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి, కలెక్టర్ శ్రీధ ర్‌రెడ్డి, ఎస్పీ బి.వి.రమణకుమార్, మాగుంట పార్వతమ్మ, వేమిరెడ్డి ప్రభా కర్‌రెడ్డి, మురళీకృష్ణ హజరత్‌బాబు ఈ సభలో పాల్గొంటారు. సభారంభానికి ముందు సుప్రసిద్ధ వైణికులు పి.హేమ లక్ష్మి, పద్మా చక్రవర్తి, ఎస్.నాగలక్ష్మిల గారిచే వీణకచేరి వుంటుంది. గోపాల రెడ్డి గారి అభిమానులను ఈ సభకు తరలిరమ్మంటున్నారు అవార్డు కమిటీ అధ్యక్ష, కార్యదర్శులు జె.వి.రెడ్డి, బి.వి.నర సింహం.

## అదనపు జిల్లా కలెక్టర్ దడబడలు!

అదనపు జిల్లా కలెక్టర్‌గా బాధ్య తలు తీసుకొన్న లక్ష్మీకాంతం హుషారు గానే పనిచేస్తున్నారు. కార్పొరేషన్ ప్రత్యే కాధికారి కూడా అయిన ఆయన కార్పొ రేషన్ కార్యాలయంలోని అధికారులతో ప్రత్యేక సమావేశం నిర్వహించారు. నగరంలో దోమల నిర్మూలన కొరకు ఏ చర్యలు తీసుకొంటున్నారని ప్రశ్నించగా అధికారులు మౌనం దాల్చారు. తక్షణం కాల్వలలో పూడిక తీసి ఆయిల్ బాల్స్ వేయమని ఆదేశించారు. హోటళ్లలో శాం పిల్స్ తీస్తున్నారా అని ఆరోగ్య అధికారి డాక్టర్ సుబ్బరాజును ప్రశ్నించగా ఆయన తెల్ల మొహం వేశారు. కంపోస్ట్ యార్డుల దగ్గర గోడలు, సమ్మర్‌స్టోరేజి ట్యాంకు పనులు త్వరితగతిన చేయమని ఆదేశిం చారు.

ప్రత్యేకాధికారి సూచనలు సిబ్బం దికి గట్టిగానే అనిపించినట్లుంది. కాల్వ లలో పూడిక తీసే పనులు మొదలు పెట్టారు. ఆరోగ్యాధికారి సినిమా హాళ్లలో తనిఖీలు చేశారు. ఇవి ఆరంభ శూర త్వం కాకుండా చూసే బాధ్యత కూడా లక్ష్మీకాంతం స్వీకరిస్తే బాగుంటుంది.

## అద్వానీ రాక

బిజెపి జాతీయ నాయకుడు లాల్ క్రిష్ణ అద్వానీ 21వ తేది నెల్లూరు వస్తు న్నారు. బిజెపి కార్యకర్తల జిల్లా సద స్సులో ఆయన పాల్గొని ప్రసంగిస్తారు. స్థానిక ఎన్నికలకు ముందు బిజెపి కార్య కర్తల్లో 'జోష్' తెప్పించను అద్వానీని నెల్లూరుకు రప్పిస్తున్నట్లుంది.

## ఇన్‌ఛార్జ్ వైస్ ఛాన్సలర్ ప్రభాకర్‌రావు!

శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ఎన్.ప్రభాకర్‌రావు విక్రమ సింహపురి యూనివర్శిటీ ఇన్‌ఛార్జ్ వైస్ ఛాన్సలర్‌గా జూలై 28వ తేది బాధ్యతలు స్వీకరించారు. నెల్లూరీయుడైన ప్రభాకర్ రావు మూలాపేటలోని సిఎఎం స్కూల్‌లో ప్రాథమిక విద్య, ఆ తర్వాత వి.ఆర్ కాలే జిలో డిగ్రీ చదివారు. యూనివర్శిటీ పేరు ప్రఖ్యాతులు పెంచేందుకు కృషి చేస్తానని చెప్పారాయన.

## కాఫీబార్‌లో హుక్కా

నెల్లూరు మినీ బైపాస్‌రోడ్డులోని గ్రీన్‌హౌస్ కాఫీబార్‌లో చట్టవిరుద్ధంగా మత్తును కల్గించే హుక్కాను అందు బాటులో పెట్టినందుకు గాను కాఫీబార్ నిర్వాహకులు సుమన్‌బాబు, అనిల్, అక్బర్‌లను 4వ పట్టణ ఎస్ఐ దశరథ రామయ్య అదుపులోకి తీసుకొన్నారు. పట్టణంలో చట్టవిరుద్ధ కార్యకలాపాలపై సమాచారం తెలిసిన వెంటనే అక్కడకు వెళ్లి నిందితులను అదుపులోకి తీసుకోవ డంలో దశరథరామయ్య గట్టిగా పని చేస్తున్నాడు.

## బిట్రగుంట ఎస్ఐను మందలించిన ఎస్పీ!

బోగోలు మండలం కేంద్రంగా నడుస్తున్న క్రిస్టియన్ మనీ సర్క్యులేషన్ స్కీమ్‌లకు అండగా నిలుస్తున్నాడని ఆరో పణలు ఎదుర్కొంటున్న కప్పరాళ్లతిప్ప ఎస్ఐ జగత్‌సింగ్‌ను ఎస్పీ బి.వి.రమణ కుమార్ నెల్లూరుకు పిలిపించి మంద లించారు. ఇతనిపై విచారణకు కావలి డిఎస్పీని నియమించారు.

## వివేకా విమర్శలు

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి తిట్టి పెట్టారు. తప్పుచేస్తే ఎవరికైనా శిక్ష పడాల్సిందేనని దీనికి జగన్ అతీతుడు కాదన్నారు. సిబిఐ నివేదికలో జగన్‌కు ఒక ఎమ్పీ వ్యాపార భాగస్వామి అని రావడం వల్ల నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఉలిక్కిపడుతున్నారని విమర్శించారు. పత్రికలు, ఛానళ్లు వున్నా యని ఇష్టమొచ్చినట్లు వ్రాయడం, వార్తలు ప్రసారం చేయడం జగన్‌కు తగదన్నారు.

## ఎసి స్టేడియంలో క్రీడా వసతి గృహం!

గతవారం ముఖ్యమంత్రి పర్యట నలో చేసిన వాగ్దానం మేరకు నెల్లూరు ఎసి సుబ్బారెడ్డి స్టేడియంలో క్రీడా వసతి గృహానికి ప్రభుత్వం మూడు కోట్ల రూపాయలు మంజూరు చేసింది. ఇక్కడ క్రీడాపరికరాలు, సరికొత్త హాస్టల్ అందు బాటులో వుంటుంది. క్రీడలపై ఆసక్తి వుండే యువత ఇక్కడ చేరి శిక్షణ పొంద వచ్చు.

## కానిస్టేబుళ్ల సస్పెన్షన్!

స్టువర్ట్‌పురం దొంగ సురేష్‌ను గూడూరు నుంచి కడ పకు తరలిస్తూ ఉద్దేశ్య పూర్వకంగా తప్పిం చిన ఆర్మ్‌డ్ రిజర్వు ఫోర్స్ కానిస్టేబుళ్లు మనోహర్, రాఘవ లను సస్పెండ్ చేస్తూ ఎస్పీ బి.వి.రమణ కుమార్ ఉత్తర్వులు జారీ చేశారు. పోలీ సులు ఎంత బరితె గించి దొంగలకు సహాయం చేస్తున్నా రన్న విషయం ఈ సంఘటనతో లోకా నికి వెల్లడయ్యింది.

## ఆదాల మువ్వల రవళి

సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డిలో నిద్రాణమై వుండిన కళాకా రుడు మేలుకొన్నాడు. ఆదాల నృత్య కళాపీఠం స్థాపించి జాతీయస్థాయిలో ఆయన మొట్టమొదటిసారిగా పెట్టిన కూచిపూడి నృత్య పోటీలు 4వ తేది ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ కలసి ప్రారం భించారు. సబ్ జూనియర్, జూనియర్, సీనియర్ స్థాయిల్లో 7వ తేది వరకు జరిగే ఈ పోటీల్లో విజేతలకు పెద్ద మొత్తాలు బహుమతులుగా ఇస్తారు. శంకరాభరణం ఫేమ్ మంజుభార్గవి ఆదాల నృత్యకళాపీఠానికి సలహాదారులుగా వ్యవహరిస్తున్నారు. 7వ తేది సాయంత్రం మంజుభార్గవి సత్కారం తర్వాత ఆమె కూచిపూడి నృత్య ప్రదర్శన కూడా ఇస్తారు. నెల్లూరీయులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నాడు ఆదాల.

## కత్తికి ఉద్వాసన

నెల్లూరు కలెక్టరేట్‌లో భూ సేక రణ విభాగంలో ప్రత్యేకాధికారిగా పని చేస్తున్న కత్తి సుబ్రహ్మణ్యంరెడ్డిని ఆ బాధ్య తల నుంచి తప్పుకోమని కలెక్టర్ సూచిం చినట్లు తెలిసింది. ఈ అధికారి నిర్ణ యాల మూలంగా జిల్లాలో పరిశ్రమ లకు భూమి కేటాయింపు వ్యవహారం గబ్బుగా మారింది.

## వైఎస్ఆర్ కాంగ్రెస్ కార్యాలయం

నెల్లూరు పొదలకూరురోడ్డులోని కలెక్టర్ బంగ్లా ముందు సందులో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జిల్లా కార్యా లయానికి ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డి ప్రారంభోత్సవం చేశారు. అన్ని హం గులున్న అత్యాధునిక కార్యాలయమిది. పార్టీకి జిల్లా కార్యాలయం లేకపోవ డంతో రాజీవ్‌భవన్, మేకపాటి గెస్ట్‌హౌస్ నుంచి పార్టీ కార్యకలాపాలు నడిచేవి.

## జైలు సూపరింటెండెంట్

నెల్లూరు సెంట్రల్ జైలు సూప రింటెండెంట్‌గా జనార్దన్‌రెడ్డి నియమితు లయ్యారు. చర్లపల్లి సెంట్రల్ జైలులో డిప్యూటీ సూపరింటెండెంట్‌గా పనిచే స్తున్న ఈయనకు ప్రమోషన్ ఇచ్చి ఇక్క డకు పంపారు.

## కిషోర్‌బాబుకు వెసలుబాటు!

నెల్లూరు మహిళా పోలీస్‌స్టేషన్ సిఐగా పనిలేక కౌన్సిలింగ్‌లు చేయలేక ఇబ్బంది పడుతుండిన కిషోర్‌బాబును విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖ సిఐగా బదలీ చేశారు. ఇక్కడ ఆయనకు ఫుల్‌గా పని వుంటుంది కాబట్టి ప్రతి భను నిరూపించుకోవచ్చు.

## రైల్వే డిఎస్పీగా శ్రీనివాసులు నాయుడు

నెల్లూరు రైల్వే డిఎస్పీగా జి.శ్రీని వాసులు నాయుడు 1వ తేది బాధ్యతలు స్వీకరించారు. నాయుడు నెల్లూరుకు పాతకాపే. ఎస్ఐగా లా అండ్ ఆర్డర్, ఇంటెలిజెన్స్; సిఐగా విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో పనిచేశారు. విజిలెన్స్ విభాగంలో బాగా పనిచేసిన ఆయనకు ఇటీవలే డిఎస్పీ ప్రమోషన్ రావడం, నెల్లూరులో పోస్టింగ్ దక్కడం అదృష్టమే. శ్రీనివాసులు నాయుడు కుర్చీలో గమ్మున కూర్చొండే రకం కాదు. రైళ్లలో దొంగతనాలు చేసేవాళ్లు ఇక జాగ్రత్తగా వుండక తప్పదు.

కొరవ 14వ పేజీలో



● విద్యాసంస్థల మధ్య వివాదాన్ని

# సెటిల్ చేసిన వివేకా!

● లక్షల్లో ముడుపుల మూట అందుకొన్నాడు

జిల్లాలో గుర్తింపులేని పాఠశాలలపై చర్యలు తీసుకోవాలని, వాటిని మూసి వేయించాలని కోరుతూ గత కొంతకాలంగా ప్రైవేట్ పాఠశాలల అసోసియేషన్లు, విద్యార్థి సంఘాలు ఆందోళన కార్యక్రమాలు నిర్వహిస్తుండడం తెలిసిందే. ఈ వివాదానికి రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి తనదైనశైలిలో సెటిల్‌మెంట్ చేశాడు. ప్రభుత్వ గుర్తింపు లేకుండా చాలాకాలంగా జిల్లాలో వివిధ పాఠశాలలు నడుస్తున్నాయి. కార్పొరేట్ విద్యాసంస్థలు సైతం ఒకటి రెండు బ్రాంచీలకు మాత్రమే గుర్తింపు తీసుకొని మిగతా వాటిని నిర్వహించేస్తున్నాయి. ఇప్పుడు బయటి ప్రాంతాల నుంచి పెద్దపెద్ద సంస్థలు వచ్చి నగరంలో విద్యాసంస్థలను ఏర్పాటు చేయడం, గుర్తింపు లేకుండానే పాఠశాలలు నడుపుతుండడంతో ప్రైవేట్ పాఠశాలల అసోసియేషన్లు దీనిపై పెద్దఎత్తున ఉద్యమం చేపట్టాయి. జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయం ముందు ఆందోళనకు దిగాయి. ఈ విద్యాసంస్థలు ఆర్థికంగా బలవంతమైనవి కావడం, రాజకీయంగా పలుకుబడి కలిగినవి కావడంతోపాటు, విద్యాశాఖ అధికారులకు తగినంత ముట్టజెప్పడంతో గుర్తింపులేని పాఠశాలలపై చర్యలు తీసుకోలేదు. దీంతో పలు పాఠశాలల యాజమాన్యాలు, గుర్తింపు లేని సంస్థలు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డిని ఆశ్రయించడంతో ఆయన తనదైన రాజకీయం ప్రదర్శించాడట. ఇరుసంస్థలపై ఆయన ఆగ్రహం వ్యక్తం చేసిన ఆయన ఎవరి పని వాళ్ల చేసుకోకుండా ఈ గోల ఏందని మందలించాడట. గుర్తింపులేని పాఠశాలలు మూసి వేయించమంటే చిటికెలో చేస్తా అయితే మీలో ఎందరు సక్రమంగా గుర్తింపులను రెన్యువల్ చేయిస్తున్నారు. ఎందరు అక్రమంగా పాఠశాలలు నిర్వహిస్తున్నారు నాకు తెలుసు. రేపొచ్చి మీ పాఠశాలలకు సడలింపు ఇవ్వండని రెకమెండేషన్ చేయమంటే కుదరదు అని ఖరాఖండిగా చెప్పాడట. లేదంటే ఎవరి పనివారు చేసుకోండి అని రెండు ఆప్షన్స్ ఇవ్వడంతో చేసేదిలేక అంతా ఆనం చెప్పిన దారికొచ్చి గమ్మునుండిపోవడంతో గుర్తింపు వివాదం అటకెక్కింది. ఆనం సెటిల్‌మెంటుకు లక్షల్లో ముడుపులు అందించారట పెద్ద విద్యాసంస్థల యాజమాన్యాలు. వివేకానందరెడ్డినా మజాకానా?

సిఎం పర్యటనకు

# కార్పొరేషన్ ఖర్చు కోటి!

● వీళ్లెందుకు ఖర్చు పెట్టాల్సి వచ్చింది?

రాష్ట్ర ముఖ్యమంత్రి ఎన్.కిరణ్‌కుమార్‌రెడ్డి గత నెల 24వతేది నెల్లూరు నగర పర్యటన సందర్భంగా ఖర్చు చేసిన నిధులపై మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు వివరాల సేకరణలో పడ్డారు. కాకుటూరు వద్ద విక్రమ సింహపురి యూనివర్శిటీ నిర్మాణం కోసం చేసిన శంకుస్థాపన కార్యక్రమం తప్ప మిగిలిన అన్ని కార్యక్రమాలు కూడా కార్పొరేషన్ నిధులతోనే జరిగాయి. వేదాయపాళెం సెంటర్‌లో జగజ్జీవన్‌రామ్ విగ్రహం, కరెంటాఫీస్ సెంటర్‌లో దివంగత ముఖ్యమంత్రి వై.ఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహం, పొదలకూరురోడ్డులో పైలాన్ ప్రారంభోత్సవాలు సిఎం చేతుల మీదుగా చేయించారు. అలాగే విఆర్సీ మైదానంలో వివిధ నిర్మాణ పనులకు సంబంధించి ఏర్పాటు చేసిన శిలాఫలకాలకు శంకుస్థాపన జరిగింది.

సిఎం పర్యటన సందర్భంగా చేసిన అన్ని ఏర్పాట్లకు దాదాపు కోటి రూపాయలకు పైగా ఖర్చు చేసినట్లు తెలుస్తుంది. కార్పొరేషన్ సాధారణ నిధుల నుంచి అడ్వాన్స్ రూపంలో చెల్లింపులు జరిపారు. వివిధ విభాగాల ఆధ్వర్యంలో చేసిన ఖర్చుల వివరాలను రికార్డుల్లో నమోదు చేసే పనిలో ఇంజినీర్లు నిమగ్నమై వున్నారు. సిఎం పర్యటనను సాకుగా తీసుకొని ఇష్టానుసారంగా అధికారులు వ్యవహరించారన్న విమర్శలున్నాయి. కొందరు అధికారులు పనిలో పనిగా చేతివాటం కూడా ప్రదర్శించారన్న ప్రచారం జరుగుతుంది.

● అంకులపాటూరులో

# థర్మల్ విద్యుత్ ప్రాజెక్టు వద్దు!

ఆగష్టు 10వతేది చిల్లకూరు మండలం అంకుల పాటూరులో జరగబోయే విఎస్ఎఫ్ ప్రజాభిప్రాయసేకరణ కార్యక్రమాన్ని రద్దుచేయాలని జిల్లా కలెక్టర్‌ను శాసనమండలి సభ్యుడు వి.బాలసుబ్రహ్మణ్యం కోరారు. థర్మల్ ప్రాజెక్టుల ఏర్పాటు కంటే ముందుగా సామూహిక పర్యావరణ కాలుష్య ప్రభావిత నివేదికను తయారు చేయమని ప్రభుత్వాన్ని కోరారు. జిల్లాలోని తీర ప్రాంతంలో కొలువుదీరనున్న థర్మల్ విద్యుత్ కేంద్రాల వల్ల సస్యశ్యామలమైన నెల్లూరు జిల్లా వల్లకాడుగా మారనుంది. ఈ థర్మల్ కేంద్రాలు రోజుకు 34వేల మెగావాట్ల విద్యుత్ తయారీకి

## కలెక్టర్‌ను కోరిన ఎమ్మెల్సీ బాలసుబ్రహ్మణ్యం

ఆరులక్షల టన్నుల బొగ్గును మండించబోతున్నాయి. ఈ బొగ్గు మండించడం వల్ల ఈ ప్రాంతంలో ఐదు డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రత పెరిగి 30శాతం పంటల దిగుబడి తగ్గిపోతుంది. రొయ్యలసాగు అడ్రస్ వుండదు. సల్ఫర్ డై-ఆక్సైడ్, నైట్రోజన్ ఆక్సైడ్ విషవాయువులు టన్నుల కొద్దీ విడుదలై ఆమ్లవర్షాలు కురుస్తాయి. ప్రజలు అనారోగ్యాల పాలవుతారని బాలసుబ్రహ్మణ్యం ఆవేదన వ్యక్తం చేశారు. వీటన్నింటిని దృష్టిలో పెట్టుకొని 10వ తేది అంకులపాటూరులో జరిగే ప్రజాభిప్రాయసేకరణ కార్యక్రమాన్ని రద్దు చేయమని ఎమ్మెల్సీ డిమాండ్ చేశారు.




నెల్లూరులోని సంక్షేమ భవన్ సముదాయం.

● సంక్షోభంలో



**సంక్షేమ శాఖలపై ఆశలు సన్నగిల్లే పరిస్థితి ఏర్పడింది. వీటికి రాష్ట్ర ప్రభుత్వం నిధులు మంజూరు చేయకపోవడంతో ఆ శాఖల పరిస్థితి అగమ్యగోచరంగా తయారయ్యింది.**

పేద, బడుగు బలహీనవర్గాల ఆర్థికాభివృద్ధిలో సంక్షేమశాఖల పాత్ర కీలకమైనది. ఈ శాఖలకు అధికశాతం నిధులు కేటాయించి సంక్షేమ, అభివృద్ధి పథకాలు అమలు చేస్తుంది ప్రభుత్వం. రాష్ట్రప్రభుత్వం ఆర్థిక వనరులు సమకూర్చక పోవడంతో సంక్షేమశాఖల పనితీరు గాడితప్పింది. గత సంవత్సరం నుంచి సంక్షేమశాఖలకు నిధులు రాకపోవడంతో అధికారులు ఏం చేయలేక కార్యాలయాల్లో ఖాళీగా కనిపిస్తున్నారు. దీంతో లబ్దిదారులు కూడా కార్యాలయాల చుట్టూ తిరిగే ఓపికలేక నిలిచిపోతున్నారు.

జిల్లాలో గిరిజన సంక్షేమశాఖ, సాంఘిక సంక్షేమశాఖ, వెనుకబడిన తరగతుల సంక్షేమశాఖ, వికలాంగుల సంక్షేమశాఖ, మైనార్టీ సంక్షేమశాఖలతోపాటు, జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, జిల్లా పరిశ్రమల కేంద్రం, ఖాదీ బోర్డులు వివిధ పథకాలు అమలు చేస్తుంటాయి. జిల్లాలో ప్రధానంగా ఎస్సీ కార్పొరేషన్ ద్వారా కోట్ల రూపాయలు రుణాలు అందించేవారు. రెండవ స్థానంలో గిరిజన సంక్షేమశాఖ రుణాలు అందించేది. ప్రస్తుతం ఎస్సీ కార్పొరేషన్‌కు బడ్జెట్‌లో చూపించిన విధంగా నిధుల కేటాయింపు జరుగలేదు.

గత సంవత్సరం మంజూరు చేయబడిన యూనిట్లకు సబ్సిడీ బకాయిలు ఇంకా వున్నాయి. సబ్సిడీ మంజూరు చేయకపోవడంతో బ్యాంకులు రుణాలు మంజూరు చేసేందుకు వెనుకంజ వేస్తున్నాయి. గిరిజన సంక్షేమశాఖ పరిస్థితి మరోవిధంగా వుంది. ఇక్కడ పని చేస్తున్న ప్రాజెక్టు అధికారిణి వేరే ప్రాంతానికి బదలీ కావడంతో ఇన్‌చార్జిగా మైక్రో ఇరిగేషన్ అధికారిణి కమలకుమారిని నియమించడం జరిగింది. రెండు శాఖల పని తీరును పర్యవేక్షించడం ఆమెకు కష్టతరంగా మారింది. గిరిజన సంక్షేమశాఖ పరిధి నాలుగు జిల్లాల వరకు వుంది. ప్రతిరోజు సభలు సమావేశాలు, పర్యటనలు చేయాల్సి వుంటుంది.

అలాగే మైక్రో ఇరిగేషన్ ఆధ్వర్యంలో చేపట్టే పనులు నిత్యం పరిశీలన చేయాల్సి వుంటుంది. ఈ రెండుశాఖలను సమన్వయం చేసుకుంటూ పరిపాలన సాగించాలి. ఈ నేపథ్యంలో కార్యాలయ పనులు స్తంభించిపోతున్నాయి. ఇన్‌చార్జి పిఓను కలిసేందుకు దూరప్రాంతాల నుంచి నగరానికి వస్తున్న ప్రజలు వెనుతిరగాల్సి వస్తుంది. కార్యాలయంలో వున్న సిబ్బంది కూడా సక్రమంగా విధులకు హాజరు కావడం లేదు. జిల్లాలో టిడిఏతోపాటు ఎస్సీ కార్పొరేషన్, సెట్నెల్‌శాఖలు ఇన్‌ఛార్జిల పాలనలో కొనసాగుతున్నాయి. ఇక్కడ పనిచేస్తున్న అధికారులు బదలీపై వెళ్లి నెలలు గడుస్తున్నా రెగ్యులర్ అధికారులను నియ మించేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకోవడం లేదు.

సంక్షేమశాఖలపై ఆశలు సన్నగిల్లే పరిస్థితి ఏర్పడింది. ఏ వర్గ ప్రజల కోసం సంక్షేమశాఖలు ఏర్పడ్డాయో ఆ ప్రజలకు ప్రభుత్వం ఆర్థిక చేయూతనివ్వలేకపోతుంది. ఫలితంగా దారిద్ర్యరేఖకు దిగువనున్న వారు మరింత దుర్భర జీవనం సాగించాల్సి వస్తుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంక్షేమశాఖలను నిర్వీర్యం చేయకుండా నిధులు కేటాయించి నిజాయితీగల అధికారులను నియమించాల్సిన అవసరం వుంది. ◆J



పదవ తరగతి పరీక్షలలో అత్యధిక మార్కులు సంపాదించిన పోలీసుల పిల్లలకు బహుమతులు అందజేస్తున్న ఎస్పీ రమణకుమార్. చిత్రంలో ఎఎస్పీ నాగేశ్వరరావు, సిఐ కృష్ణకిషోర్‌రెడ్డి.




నెల్లూరులోని తిక్కన రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన సాహిత్య పురస్కారాల సభలో మాట్లాడుతున్న జాలె వాసుదేవనాయుడు. వేదికపై ఆచార్య ఆదిత్య, ఆర్వీ శేషయ్య నాయుడు.




మతతత్వ లక్షిత హింసా నివారణ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టాలన్న ప్రయత్నాన్ని మానుకోవాలని కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న విశ్వహిందూ పరిషత్ కార్యకర్తలు.

## కరెంట్ బిల్లు కట్టని తీరప్రాంతవాసులు!

• భలే పద్ధతి నేర్చుకొన్నారు.

బోగోలు తీరప్రాంత వాసుల కరెంటు బిల్లుల బకాయిలు లక్షల్లో పేరుకుపోతున్నాయి. షుమారు 7లక్షల రూపాయలు దాక ఈ మొత్తాలు పేరుకపోవడంతో విద్యుత్‌శాఖాధికారులు బకాయిదారులకు నోటీసులు జారీచేసినా ఫలితం లేకుండా పోయిందట. ఇక వీరందరికి విద్యుత్ సరఫరా కట్ చేసేందుకు అధికారులు ప్రయత్నిస్తున్నారు. గతంలో మూడేళ్ల క్రిందట ఇలాగే ఆ ప్రాంతీయులు విద్యుత్ బిల్లులు బకాయిలుపడడంతో కనెక్షన్‌లు తొలగించారు. అప్పుడు రెండురోజులపాటు తీరప్రాంతంలో చీకటి అలుముకొంది. ఈ విషయం తెలుసుకొన్న కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు బకాయి మొత్తం ఆరులక్షల రూపాయలు తానే చెల్లించి విద్యుత్ సరఫరా పునరుద్ధరింపజేశారు. తిరిగి అలాంటి సమస్య ఎదురుకావడంతో దీనిపై చర్య తీసుకొనేందుకు విద్యుత్ అధికారులు మల్లగుల్లాలు పడుతున్నారు.

# కొత్తూరులో సాయికరుణ టెలీఫిల్మ్ షూటింగ్!

**సాయిబాబాగా కళాంజలి శ్రీను**

ఇందుకూరుపేట మండలం కొత్తూరులో సాయి కరుణ టెలిఫిల్మ్ షూటింగ్ జరిగింది. నెల్లూరు చెందిన కళాంజలి ఆర్కెస్ట్రా నిర్వాహకుడు శ్రీనివాస చక్రవర్తి నిర్మించి నటిస్తున్న చిత్రం షూటింగ్ మైపాడు సముద్రతీరం, బాబా మందిరంతోపాటు తోటపల్లి గూడూరు మండలం జ్వాలాముఖి ఆలయం వద్ద కొన్ని సన్నివేశాలను చిత్రీకరించారు. ఈ సందర్భంగా షిర్డీ సాయిబాబా పాత్రను పోషిస్తున్న చక్రవర్తి మాట్లాడుతూ సందేశాన్ని అందించేలా రూపొందిస్తున్న ఈ సాయికరుణ టెలిఫిల్మ్‌కు జయచంద్ర దర్శకత్వం వహిస్తున్నారన్నారు. ఉదయ్ ఫోటోగ్రాఫర్‌గా, అల్లాభక్షు మేకప్ మెన్‌గా వ్యవహరిస్తున్న ఈ చిత్రంలో మొత్తం ఆరుపాటలుంటాయని, అన్నింటిని షిరిడి బాబాపైనే చిత్రీకరిస్తున్నామని చెప్పారు. చక్కని సన్నివేశాలతో రూపుదిద్దుకొంటున్న ఈ



చిత్రాన్ని ప్రేక్షకులు ఆదరిస్తారన్న నమ్మకాన్ని ఆయన వ్యక్తం చేశారు.

## దొంగలతో ఆటోడ్రైవర్ల కుమ్మక్కు!

**ఫోన్‌చేసి వివరాలు చెబుతున్నారు**

కావలి నుంచి ఆటోల్లో పలు ప్రాంతాలకు వెళ్లే ప్రయాణీకులను దోపిడీ చేస్తున్నారు దొంగలు. ఇలాంటి ఘటనలు అధికమవుతుండడంతో ఆటోల్లో ప్రయాణించాలంటేనే హడలిపోతున్నారు ప్రయాణీకులు. కావలి నుంచి అల్లూరు, తిప్ప తదితర ప్రాంతాలకు వెళ్లేందుకు బస్సులు సక్రమంగా వుండవు. ఒకటి అరా తిరిగే బస్సులు ఎప్పుడు వస్తాయో తెలియవు. దీంతో అధికశాతం మంది ప్రయాణీకులు ఆటోలను ఆశ్రయిస్తుంటారు. కొందరు దొంగలతో సంబంధాలున్న ఆటోవాళ్లు తమ వాహనంలో ఎక్కిన ప్రయాణీకులు ఆభరణాలు ధరించి వుంటే తాము ఏ ప్రాంతానికి వెళ్తున్నామో ముందుగా సమాచారం సెల్‌ఫోన్లలో అందిస్తుండడంతో పక్కాగా ప్లాన్ వేసుకొని దొంగలు ఆటోలపై పడి అందినంత దోచుకెళ్తున్నారు. ముంగమూరు, తిప్ప, కడనూతల మార్గాలలో ఇలాంటి దోపిడీలు అధికమయ్యాయి. ఇటీవల అల్లూరులో ప్రయాణీకులను ఎక్కించుకొని బయలుదేరిన ఆటో బోగోలు మండల కార్యాలయం వద్దకు రాగానే అక్కడ కాపుకాచి వున్న దొంగలు ఆటోను ఆపి ఆరుసవర్ల నగలు దోచుకపోయారు. బాధితులు వెంటనే పోలీసులకు సమాచారం అందించడంతో వారు దొంగలను త్వరగా పట్టకోగలిగారు. మొత్తం మీద ఆటోల్లో ప్రయాణం అంటేనే భయపడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. పోలీసులు దొంగలతో మిలాఖత్ అవుతున్న ఆటోలపై నిఘా పెంచి దొంగతనాలను అరికట్టాల్సి వుంది.

## నిరుపయోగంగా ఇనమడుగు ఆస్పత్రి!

**మూడు లక్షలు మట్టిపాలు**

కోవూరు మండలం ఇనమడుగు గ్రామంలో లక్షల రూపాయలు వెచ్చించి నిర్మించిన హోమియో ఆస్పత్రి భవనం నిరుపయోగంగా మారింది. ఎవరికీ పట్టకపోవడంతో ఆస్పత్రి ప్రాంగణంలో ముళ్లపొదలు, కంపచెట్లు మొలచి వున్నాయి. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి. గ్రామంలో గల హోమియో వైద్యశాలకు ప్రత్యేక భవన వసతి లేకపోవడంతో స్థానికంగా ఉండే గ్రంథాలయంలోనే దీనిని నిర్వహిస్తూ వస్తున్నారు. 2007 సంవత్సరంలో ప్రజల కోరిక మేరకు మూడు లక్షల రూపాయలతో ప్రత్యేక భవనాన్ని నిర్మించగా, అప్పటి శాసనసభ్యుడు పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డి దీనిని ప్రారంభించారు. నూతన భవనం ఏర్పడినా హోమియో వైద్యశాల గత నాలుగేళ్లుగా గ్రంథాలయంలోనే నడుస్తుంది తప్ప క్రొత్త భవనంలో ఏర్పాటు కాకపోవడంతో లక్షల రూపాయలు వెచ్చించి నిర్మించిన భవనం నిరుపయోగమయ్యింది. సంబంధిత అధికారులకు సైతం హోమియో వైద్యశాలను నూతన భవనంలోకి మార్చాలన్న ఆలోచనే లేకపోవడంతో ఆ భవనం దిష్టిబొమ్మగా మారింది. ఇప్పటికైనా ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని ఆస్పత్రిని కొత్తభవనంలోకి మార్చాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

## ధ్వంసమైపోయిన రోడ్లు!

• కలువాయిలో పరిస్థితిది.

కలువాయి ప్రాంతంలో రహదారుల పరిస్థితి దారుణంగా వుంది. ఎక్కడికక్కడ రోడ్లు ధ్వంసమైపోయి వుండడంతో ఈ మార్గంలో ప్రయాణించాలంటేనే ఒళ్లు హూనమైపోతోంది. కలువాయి నుంచి కోటితీర్థం, కాకివాయిల మీదుగా చేజర్లకు వెళ్లే రెండు మార్గాలు పూర్తిగా దెబ్బతినిపోయాయి. గతంలో ఈ రోడ్డు నిర్మాణం చేపట్టినా పరమనాసిరకంగా జరగడంతో వేసిన కొద్దిరోజులకే ధ్వంసమైపోయింది. చేజర్ల, కలువాయి మండలాలకు చెందిన పలు గ్రామాల ప్రజలు ఈ రెండు మార్గాల గుండా కలువాయికి వివిధ పనులపై రాకపోకలు సాగిస్తుంటారు. చేజర్ల మండలానికి చెందిన కొమ్మి లక్ష్మయ్యనాయుడు, బొల్లినేని కృష్ణయ్యలు గతంలో ఎమ్మెల్యేలుగా పని చేసినా ఈ రోడ్డు బాగోగులు పట్టించుకోలేదన్న విమర్శలు వున్నాయి. ఇటీవల తరచూ చేజర్ల మండలంలో వివిధ అభివృద్ధి కార్యక్రమాలకు వచ్చి వెళ్తున్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి దెబ్బతిన్న రోడ్డుకు మరమ్మత్తులు చేపట్టి పరిస్థితిని చక్కదిద్దుతాడేమోనని ఈ మండల ప్రజలు ఎదురుచూస్తున్నారు. వారి ఆశలు ఫలిస్తాయోలేదో చూడాలి.

# పొదలకూరు పాలశీతలీకరణ కేంద్రం మూత

మంత్రులు, ప్రజాప్రతినిధులు పాల్గొని అట్టహాసంగా ప్రారంభించిన పొదలకూరు పాల శీతలీకరణ కేంద్రం మూతబడింది. జిల్లాలో గ్రామీణ ప్రాంతాల్లో పాడిని పెంచేందుకు కృషి చేస్తున్నామని అధికారులు, పాలకులు చెప్తున్నా ఆచరణలో అందుకు విరుద్ధంగా వుందనడానికి పొదలకూరు కేంద్రం ఉదాహరణ. 2006వ సంవత్సరంలో పాల శీతలీకరణ కేంద్రాన్ని ఆనాటి వ్యవసాయ శాఖమంత్రి రఘువీరారెడ్డి, జిల్లామంత్రి ఆనం రామనారాయణరెడ్డి, జిల్లాపరిషత్ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి కలసి ప్రారంభించారు. 55లక్షల రూపాయలు వ్యయం చేసి నిర్మించిన ఈ కేంద్రం కొద్ది కాలానికే మూతపడింది. పర్యవేక్షణా లోపం, సిబ్బంది చేతివాటం, ఇతరత్రా కారణాలతో రైతులకు ఉపయోగకరంగా వుండాల్సిన ఈ కేంద్రం మూతపడింది. లక్షలు విలువ చేసే అక్కడి పరికరాలు మాత్రం ప్రైవేట్ డైరీ

**రంగారెడ్డిగారు తెరిపించండి.**

నిర్వాహకులకు ఉపయోగపడుతున్నాయి. విజయడైరీ ఛైర్మన్‌గా సారథ్య బాధ్యతలు చేపట్టిన కొండ్రెడ్డి రంగారెడ్డి చొరవ తీసుకొని పాల శీతలీకరణ కేంద్రాన్ని తిరిగి వినియోగంలోకి తేవాలని పొదలకూరు ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.



జొన్నవాడ ప్రభుత్వ పాఠశాలలో విద్యార్థులతో పాఠ్యాంశాల బోధనపై ముచ్చటిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

## ఆపరేటర్ లేదు... పనులు చేయను!

దగదర్తి మండల రెవెన్యూ కార్యాలయంలో కంప్యూటర్ ఆపరేటర్లు లేకపోవడంతో ముఖ్యమైన కార్యకలాపాలు స్తంభించిపోతున్నాయి. గతంలో ఇక్కడ ఆపరేటర్‌గా పనిచేస్తున్న వ్యక్తి విధులకు హాజరు కాకపోవడంతో వివిధ పనులపై తహశీల్దార్ కార్యాలయానికి వచ్చే రైతులు, విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. సర్టిఫికేట్లు అందజేయడంలోను, బ్యాంకు రుణం కోసం వివిధ పత్రాల కోసం వచ్చే వారు రోజుల తరబడి నిరీక్షించాల్సి వస్తోందని వివిధ గ్రామాల ప్రజలు వాపోతున్నారు. తహశీల్దార్ బషీర్ మాత్రం వున్న ఆపరేటర్ విధులకు హాజరు కావడం లేదు క్రొత్త వ్యక్తి వచ్చే వరకు మనమేం చేయలేమంటూ చెప్తుండడంతో ప్రజలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు.

## కలువాయిలో విలువైన స్థలాలు కబ్జా!

● చోద్యం చూస్తున్న అధికారులు.



కలువాయి బస్టాండులో దురాక్రమణలకు గురైన స్థలం.

కలువాయిలో లక్షలరూపాయలు విలువ చేసే పంచాయితీ, ఆర్‌అండ్‌బి స్థలాలు ఆక్రమణకు గురౌతున్నా పట్టించుకొనేవారే కరువయ్యారు. పాలకుల స్వార్థం, అధికారుల ఉదాసీనత కారణంగా ఆక్రమణలు పెచ్చుమీరుతున్నాయి. తామేం చేసినా అడిగేవారు లేకపోవడంతో కబ్జాదారులు చెలరేగిపోతున్నారు. ఆక్రమణ స్థలాల్లో ఏకంగా శాశ్వత కట్టడాలు నిర్మించేస్తున్నారు. గ్రామంలో నుంచి వెళ్లే సోమశిల రోడ్డుకు ఇరువైపులా వున్న ఆర్‌అండ్‌బి స్థలం, దానికి ఆనుకొని పంచాయితీ కొల్లగుంటలో స్థలాలు వున్నాయి. కబ్జాదారుల కన్ను ఈ స్థలాలపై పడింది. అంతే పెద్దఎత్తున స్థలాలు ఆక్రమించడమేకాక షాపులు కట్టి బాడుగలకు ఇవ్వడం, అమ్మడం చేస్తున్నారు. గతంలో సర్పంచ్‌గా వుండిన చల్లా వెంకటరమణారెడ్డి ఈ ఆక్రమణలు తొలగించి పంచాయితీకి ఆదాయం సమకూర్చేలా షాపింగ్ కాంప్లెక్స్ కట్టాలని ప్రయత్నించగా, ఆక్రమణదారులు అప్పటి ఎమ్మెల్యేగా వున్న వ్యక్తిని ఆశ్రయించి ఆఘమేఘాలపై స్టే తెచ్చి స్థలాలను మార్కెట్ రేటుకు ఇప్పించాల్సిందిగా కోర్టును ఆశ్రయించారు. దీంతో ఆక్రమణల తొలగింపు తాత్కాలికంగా నిలిచిపోయింది. హైకోర్టు దీనిపై అధికారుల వివరణ కోరినట్లు సమాచారం. ఎంతో విలువైన పంచాయితీ స్థలాలను ఆక్రమణదారులకు అప్పగించేది లేదన్న కలెక్టరు, ఆ స్థలాల్లో నిర్మించిన కట్టడాలకు విద్యుత్, కొళాయి కనెక్షన్ మంజూరు చేయవద్దని ఆదేశాలు జారీ చేసినట్లు తెలుస్తోంది. ఈ ఆక్రమణలు ఎప్పటికి తొలగిస్తారోనని ప్రజలు ఎదురుచూస్తున్నారు.

● రసవత్తరంగా

## ఉదయగిరి రాజకీయం!

ఎమ్మెల్యే X జలదంకి మండలాధ్యక్షుడు

ఉదయగిరి నియోజకవర్గంలో మారిన రాజకీయ సమీకరణల నేపథ్యంలో నేతల మధ్య పోరు రసవత్తరంగా మారుతోంది. నిన్నమొన్నటి వరకు కాంగ్రెస్ పార్టీలో వుండి ఇటీవల జగన్‌పార్టీలో తిరుగుతున్న స్థానిక శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, జలదంకి మాజీ మండలాధ్యక్షుడు కృష్ణారెడ్డి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది. ఎమ్మెల్యే బ్రాహ్మణక్రాక వచ్చి తనపై విమర్శలు చేయడంపై కృష్ణారెడ్డి తీవ్రంగా స్పందించాడు. ప్రజల బాగోగులు పట్టించుకోక పార్టీ మారే ఆయన తనను విమర్శించడం సిగ్గుచేటన్నారు. మేకపాటి విజయానికి ఎంతో కృషి చేశామని, అందుకే విజయం సాధించగలిగాడని, దమ్ముంటే ఈసారి పోటీచేసి గెలవాలని సవాల్ విసిరారు. జగన్ జపం తప్ప ఏమి పట్టడంలేదని, రైతులు, ప్రజలు వివిధ సమస్యలతో అల్లాడుతుంటే పట్టించుకోని ఎమ్మెల్యేకు తనను విమర్శించే అర్హత లేదన్నారు. కృష్ణారెడ్డి విమర్శలపై వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేతలు ప్రతివిమర్శలు చేశారు. మంత్రి మెప్పు కోసం ఆయన ఎమ్మెల్యేపై తన స్థాయి మరచి మాట్లాడుతున్నారన్నారు. మండలాధ్యక్షుడు కాక మునుపు కృష్ణారెడ్డి పరిస్థితి ఏమిటో, నేటి స్థితి ఏమిటో ప్రజలందరికి తెలుసునని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేతలు ప్రసాద్, మాల కొండారెడ్డి, జయరామరెడ్డి, ఖిల్జీసలీంలు వ్యాఖ్యానించారు. మొత్తం మీద జలదంకి మండలంలో ఇరుపార్టీ నేతల మధ్య విమర్శలు జోరు నడుస్తోంది.

## వైద్యసేవల పట్ల నిర్లక్ష్యం తగదు!

వైద్యసేవలు అందించడంలో నిర్లక్ష్యం వహిస్తే సహించేది లేదని జిల్లా వైద్యఆరోగ్యశాఖాధికారి వెంకటరమణారెడ్డి వైద్యులను హెచ్చరించారు. ఉదయగిరిలో ప్రభుత్వ వైద్యశాలను ఆకస్మిక తనిఖీ చేసిన డిఎంఅండ్ హెచ్‌వో రికార్డులను తనిఖీ చేయడమేకాక వైద్యుల పనితీరును పరిశీలించారు. వైద్య సిబ్బందిపై వస్తున్న ఫిర్యాదుల విషయమై మాట్లాడుతూ వైద్యసేవలు అందించడంలో నిర్లక్ష్యం తగదన్నారు. సక్రమంగా పని

**డిఎంఅండ్‌హెచ్ఓ హెచ్చరిక**

చేయలేకపోతే సెలవుపెట్టి వెళ్లాలన్నారు. అనంతరం సీతారాంపురం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని తనిఖీ చేశారు. ఈ సందర్భంగా అక్కడి సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని, వైద్యాధికారిణి సక్రమంగా విధులకు హాజరు కావడంలేదని రిటైర్డ్ డిఎస్పీ లిఖిత పూర్వకంగా ఫిర్యాదు చేశారు. వైద్యురాలిపై డిఎంఅండ్‌హెచ్‌వో చర్యలు చేపట్టాలన్నారు. దీనికి ఆయన స్పందిస్తూ పలుమార్లు ఈ వైద్యశాలపై ఫిర్యాదులు అందాయని, పద్ధతి మార్చుకోకపోతే కఠినచర్యలు తీసుకుంటామని హెచ్చరించారు.

## అమలుకాని ఆర్థికమంత్రి హామీలు

● ఆత్మకూరు ప్రజల్లో అసంతృప్తి!

ఆత్మకూరు నియోజక వర్గ ప్రజలకు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఇచ్చిన హామీలు మూడేళ్లు గడుస్తున్నా ఒక్కటీ అమలు కాకపోవడం పట్ల ప్రజల్లో తీవ్ర చర్చ జరుగుతోంది. ఆర్థికమంత్రిగా ఎదిగినప్పటికి నియోజకవర్గ ప్రజలకు ఇచ్చిన హామీలను మంత్రి నెరవేర్చలేకపోయాడు. నియోజకవర్గాన్ని ఎంతో అభివృద్ధి చేస్తానని పదే పదే చెప్పే మంత్రిగారి మాటలు విని ఆశపడ్డ ప్రజలకు నిరాశే మిగులుతోంది. చేజర్ల – ఆత్మకూరును కలుపుతూ హైలెవల్ బ్రిడ్జి ఏర్పాటు, పట్టణాన్ని మున్సిపాల్టీ చేయడం, రెవెన్యూ డివిజన్‌గా మార్చడం, ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాల ఏర్పాటు, ఇంటిగ్రేటెడ్ హాస్టల్, ఆత్మకూరు–బట్టేపాడు కాజ్‌వే, ప్రభుత్వ ఆస్పత్రిని వంద పడకలుగా మార్చడం, సమీకృత నీటిపథకం తదితర అనేక హామీలను మంత్రి ఇచ్చి వున్నాడు. దీనిలో ఏ ఒక్కటి అమలుకు నోచుకోకపోవడంతో స్థానిక ప్రజల్లో తీవ్ర అసంతృప్తి వ్యక్తమవుతోంది. మంత్రి అనుచరులు మాత్రం నిరసన సెగలను చూసి భయపడి వారిని శాంతపరచేందుకు అదిగో, ఇదిగో అంటూ కాలం నెట్టుకొస్తున్నారు. గతంలో మున్సిపల్ మంత్రిగా వున్న సమయంలో ఆత్మకూరును మున్సిపాలిటీ చేస్తానని చెప్పిన



ఆయన ఇటీవల విజయవాడ ఎంపి లగడపాటి రాజగోపాల్‌తో కలసి ఆత్మకూరు వచ్చినప్పుడు 35వేల జనాభా వుంటేనే మునిసిపాలిటీ అవుతుందని లేకపోతే లేదని చెప్పడం విని జనం ఆశ్చర్యపోతున్నారు.

## సుకుమార్ చిటపట




తనను వ్యవసాయ మార్కెటింగ్‌శాఖ కమిషనర్ పోస్టు నుంచి బదలీ చేసినందుకు ఎ.ఆర్.సుకుమార్ చిటపటలాడుతున్నాడు. మూడున్నరేళ్లుగా ఆయన మార్కెటింగ్‌శాఖలో పాతుకుపోయాడు. ఎప్పుడు బదలీలు జరిగినా సిఫార్సు చేయించుకొని బదలీని నిలుపుకునేవాడు. సాధారణంగా ఐఎఎస్ ఆఫీసర్లను గరిష్టంగా రెండేళ్లకు మించి ఒకే పోస్టులో వుంచరు. కానీ రోశయ్య సిఎంగా వున్నప్పటికే రెండేళ్లు దాటిపోయాయి. అయితే ఒకే సామాజిక వర్గంగా చెప్పుకొని రోశయ్య దగ్గర బదలీని నిలుపుకున్నాడు. ఆ తర్వాత మాజీ స్పీకర్ సురేష్‌రెడ్డి సిఫార్సుతో కిరణ్‌కుమార్‌రెడ్డి దగ్గర బదలీని నిలుపుకుంటూ వచ్చాడు. అయితే అవినీతి, నిబంధనల ఉల్లంఘన విషయంలో సుకుమార్ చేష్టలు మరీ పెరిగిపోవడంతో ఇక బదలీ చేయక తప్పలేదు కిరణ్‌కు. తన బదలీ వార్త విన్న సుకుమార్ ప్రభుత్వాన్ని తెగ తిట్టిపోస్తున్నాడు. తన శాఖ ప్రిన్సిపల్ సెక్రటరీ దగ్గరకు వెళ్లి చిందులు వేశాడట. తనను మరో రెండేళ్లపాటు మార్కెటింగ్‌లో కొనసాగనిస్తే ఈ ప్రభుత్వం సొమ్మేంపోతుందట అంటూ మండిపడ్డాడట. కొసమెరుపు ఏమంటే సదరు ప్రిన్సిపల్ సెక్రటరీ రత్నకిషోర్ రెండేళ్లకే బదలీ లిస్టులో చేరాడు. రోలు వెళ్లి మద్దెలతో మొరపెట్టుకున్నట్లుంది కదూ!

## బ్రాహ్మణ లాబీ సంతృప్తి!




ఐఎస్ అధికారుల బదలీల్లో తమకు అన్యాయం జరిగిందని అసంతృప్తిగా వున్న బ్రాహ్మణ వర్గాన్ని కిరణ్‌కుమార్‌రెడ్డి సంతృప్తి పరచారు. మంగళవారం జరిగిన ఐఎఎస్‌ల బదలీల్లో ఈ వర్గానికి చెందిన సీనియర్ అధికారులు ఐవిఆర్ కృష్ణారావు, లక్ష్మీ పార్ధసారధిలకు మంచి పోస్టింగ్‌లు లభించాయి. టిటిడి ఎగ్జిక్యూటివ్ అధికారిగా పనిచేసిన కృష్ణారావును గతంలో ఆకస్మికంగా బదలీ చేసి ప్రాధాన్యం లేని శాఖ ఇచ్చారు. దీంతో ఆయన అలిగి ఆ పోస్టులో చేరలేదు. ఇప్పుడు ఆయన్ను వ్యవసాయ సహకార, మార్కెటింగ్‌శాఖ ప్రిన్సిపల్ సెక్రటరీగా బదలీ చేశారు. మరో సీనియర్ అధికారి లక్ష్మీ పార్ధసారధిని ప్రాధాన్యంలేని ప్రభుత్వ రంగసంస్థల ముఖ్యకార్యదర్శి పోస్టు నుంచి బదలీ చేసి కీలకమైన రవాణాశాఖ ముఖ్యకార్యదర్శిగా పోస్టింగ్ ఇచ్చారు. మొత్తానికి కిరణ్‌కుమార్‌రెడ్డి కూడా లైన్లో పడుతున్నాడని ఐఎఎస్‌లు గుసగుసలాడుకుంటున్నారు.

## జగన్ 'తడబాటు'



సిబిఐ విచారణపై వై.ఎస్ తనయుడు జగన్ తెగ తడబడిపోతున్నాడు. రాష్ట్రమంత్రి శంకర్రావు ఫిర్యాదుతో జగన్ ఆస్తులపై సిబిఐ విచారణకు హైకోర్టు ఆదేశించింది. ఆ మేరకే సిబిఐ విచారణ జరిపి కోర్టుకు రెండు దఫాలుగా నివేదికలు సమర్పించింది. సుమారు లక్ష కోట్ల రూపాయల 'స్వాహా'కు సంబంధించి సిబిఐ చాలాగట్టి సాక్ష్యాలే సేకరించినట్లుంది. విచారణ జరిగాక జగన్ మానసిక పరిస్థితి పూర్తిగా అదుపు తప్పిందని వై.ఎస్ పార్టీ సభ్యులు చెవులు కొరుక్కుంటున్నారు. తన తండ్రి వై.ఎస్ సిఎం పదవిని అడ్డం పెట్టుకొని జగన్ పెద్ద మొత్తంలో ఆస్తులు కూడబెట్టుకున్న విషయాన్ని వాళ్లు కూడా అంగీకరిస్తున్నారు. సిబిఐ విచారణ నివేదికతో తనకు కష్టాలు తప్పవని జగన్ ఇప్పటికే ఓ నిర్ణయానికి వచ్చాడట.

## శంకర్రావుకు 'ఊరట'



చేనేత జౌళిశాఖమంత్రి శంకర్రావుకు తన శాఖ కమిషనర్ నరేష్‌కుమార్‌తో అస్సలు పడటం లేదు. కమిషనర్‌పై చాలాసార్లు సిఎంకు కూడా ఫిర్యాదు చేశాడు. అలాగే కమిషనర్ కూడా ప్రధాన కార్యదర్శిని కలిసి తనను మంత్రి వేధింపుల నుంచి తప్పించాలని అభ్యర్థించాడట. రోగి, వైద్యుడు ఇద్దరూ ఒకటే కోరుకున్నట్లు మంత్రి, కమిషనర్ బదిలీ అడగటంతో సిఎం 'సరే' అన్నాడు. ఇంకేం నరేష్ బదలీ అయ్యాడు. శంకర్రావు 'ఖుషీ' వీరిద్దరి మధ్య నలిగిపోయిన ఆ శాఖాధికారులు, ఉద్యోగులు మాత్రం 'హమ్మయ్య' అంటూ ఊపిరిపీల్చుకున్నారు.






నెల్లూరు తీర ప్రాంతంలో ఇరవై తొమ్మిది థర్మల్ విద్యుత్ కేంద్రాల ఏర్పాటును నిరసిస్తూ విలేఖరుల సమావేశంలో మాట్లాడుతున్న తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.



ఆదివారం నెల్లూరులో జరిగిన ఉపాధ్యాయ అర్హత పరీక్ష టెట్‌ను వ్రాస్తున్న నిరుద్యోగ ఉపాధ్యాయులు.



జగన్స్ ఇంజనీరింగ్ కాలేజీలో జరిగిన ఎగ్జిబిషన్‌లో తాము తయారు చేసిన నమూనాలను ప్రదర్శిస్తున్న విద్యార్థులు.

# శుభప్రదమైన శ్రావణమాసం!



సృష్టి, స్థితి, లయకారకులైన త్రిమూర్తులలో స్థితికారుడు, దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడు అయిన శ్రీమహావిష్ణువు దేవేరి శ్రీమహాలక్ష్మికి అత్యంత ప్రీతికరమైన మాసం శ్రావణమాసం. వ్రతాలు, నోములు, పూజలతో నిండి వుండే ఈ మాసం ఆధ్యాత్మిక మాసంగాను పిలువబడుతుంది. దైవ చింతనతోపాటు పెళ్లిళ్ల, పేరంటాలను తెచ్చే శ్రావణం కోసం అందరూ ఎదురు చూస్తారు. ముఖ్యంగా వ్రతాలు, నోములను ఆచరించే మహిళలకు ఇది ఎంతో శుభప్రదమైన మాసం.

పూర్ణిమ నాడు చంద్రుడు శ్రవణా నక్షత్రం సమీపంలో వుంటాడు కాబట్టి దీనికి శ్రావణం అని పేరొచ్చిందని చెప్తారు. అలాగే శ్రీహరి జన్మ నక్షత్రం శ్రవణం కాబట్టి ఈ మాసాన్ని శ్రావణ మాసం అని పిలుస్తారని అంటారు. శ్రావణం ఆరంభం నుంచి నెలరోజులు అన్ని దినాలు ఎంతో ముఖ్యమైనవి. అందులో ఈ మాసంలో వచ్చే మంగళ, శుక్ర, శనివారాలు అత్యంత పుణ్యప్రదమైనవి; మహిమాన్వితమైనవిగా శాస్త్రాలు చెప్తున్నాయి. అందువల్లనే మంగళవారం నాడు మంగళ గౌరీ వ్రతాన్ని, శుక్రవారం వరలక్ష్మి వ్రతాన్ని ఆచరిస్తారు. శ్రావణ మాసంలో ఒక్కోరోజు ఒక్కో దేవతను పూజించడం వలన ఎంతో పుణ్యం దక్కుతుంది. పాడ్యమినాడు బ్రహ్మ, విదియనాడు శ్రీపతిని, తదియనాడు పార్వతిదేవి, చవితినాడు విఘ్నేశ్వరుని, పంచమినాడు శశిని ఇలా వివిధ దేవతలను అర్చించడం వలన సుఖసంతోషాలు లభిస్తాయని చెప్తారు. ఇక శ్రావణ మాసంలో చేసే వ్రతాలు, నోములకు విశేష ప్రాధాన్యముంది. కుటుంబంలో సుఖశాంతులు లభించడానికి, సౌభాగ్యానికి పలు రకాల వ్రతాలను ఆచరిస్తారు. ముఖ్యంగా మంగళవారం నాడు చేపట్టే మంగళ గౌరీ వ్రతం, పూర్ణిమ ముందు వచ్చే శుక్రవారం చేసే వరలక్ష్మీ వ్రతం విశేషమైనవిగా చెప్పబడుతున్నాయి.

వ్రతాలు, నోములే కాకుండా శ్రావణ మాసం ఎన్నో మంచిరోజులు, జయంతులు, పర్వదినాలకు నెలవైనది. నాగులచవితి, లలిత ఏకాదశి, శ్రావణ పూర్ణిమ, హయగ్రీవ జయంతి, రాఘవేంద్రస్వామి ఆరాధన, శ్రీకృష్ణాష్టమి, కామిక ఏకాదశి, పోలాయ అమావాస్య లాంటి ఎంతో విశేషమైన, శుభప్రదమైన పర్వదినాలను శ్రావణం అందిస్తుంది. అందుకే శ్రావణ మాసంలో ఇళ్లు, వాకిళ్లు తోరణాలు, రంగవల్లులు, పూజలు, అర్చనలు, నోములు, వ్రతాలు, పేరంటాలతో కళకళలాడుతూ వుంటాయి. ◆J

## ట్రంకు రోడ్డు



### అయ్యో... వేణుగోపాల?



నెల్లూరీయుల ఆరాధ్యదైవం మూలపేటలోని వేణుగోపాలస్వామిని భక్తులు దర్శించలేకున్నారు. ఆలయపెత్తనం చూసే ఆనమోళ్ల ఆంక్షలు పెడుతున్నారా అంటే అవును అనక తప్పదు. దేవస్థానంలో గత ఏడాదిగా రిపేర్లు చేస్తున్నారు. ఒక్కో పనికి ఒక్కో భక్తుని విరాళంతో చేయడం, ఆ పనులకు ఇంజనీర్లు ఎస్టిమేషన్లు రూపొందించడంలో ఆలస్యం, పనులు జరగడంలో ఇంకా ఆలస్యంతో వేణుగోపాలుని భక్తులు సందర్శించలేకపోతున్నారు. రిపేర్ల పేరుతో తనను భక్తులకు ఎక్కడ దూరం చేస్తారోనని వేణుగోపాలస్వామి కూడా లోలోన కుమలడం తప్ప ఏమి చేయలేకపోతున్నాడు.

### అంతా రహస్యం...

ఇదేమి సినిమా పేరు కాదు. జిల్లా అధికారులు వ్యవహరిస్తున్న తీరిది. కలెక్టర్ ఛాంబర్, వీడియో కాన్ఫరెన్స్‌హాల్, గోల్డన్ జూబ్లీహాల్, కార్పొరేషన్ మీటింగ్‌హాల్‌లలో ఏ అంశంపై సమీక్షా సమావేశం జరిగినా మీడియాను అనుమతించేవారు. కొత్త కలెక్టర్ శ్రీధర్‌రెడ్డికి మీడియాపై ఎందుకు చిర్రెత్తిందో ఏమో... ఇటీవల ఏ సమావేశానికి మీడియాను రానివ్వడం లేదు. సమావేశమందిరం గేటు దగ్గరే కొత్త డిపిఆర్వో కమలాకర్‌రెడ్డి నిలబడిపోయి కలెక్టర్‌గారు 'నాట్ అలౌడ్' అన్నారన్న చావు కబురు చల్లగా చెబుతున్నాడు. 28వ తేది జిల్లా అభివృద్ధిపై జరిగిన విజిలెన్స్ మానటరింగ్ సమావేశానికి వచ్చిన తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ బయటవున్న మీడియాను లోనికి తీసుకెళ్లారు. మీడియాను సమావేశాలలో అనుమతించాలని గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ నొక్కివక్కాణించారు. ఇంత రచ్చ జరిగినా 29తేది కలెక్టర్ ఎమ్పీడిఓలు, ఎమ్మార్వోలతో నిర్వహించిన సమీక్షా సమావేశానికి మీడియాని రమ్మని మేసేజ్ పంపి లోనికి అనుమతించలేదు. ఇక మీదట ఎంపిక చేసిన సమావేశాలకు మాత్రం మీడియాను అనుమతిస్తామంటున్నారు. దీనిలో నిజమెంతో?

### ఆంజనేయులుగారి అత్యుత్సాహం!

నెల్లూరు కార్పొరేషన్ కమిషనర్ డాక్టర్ పిఎస్ఆర్ ఆంజనేయులు ఓ విలక్షణ వ్యక్తి. ఆయన అధికార పార్టీలోని పెద్దనాయకుని నుంచి చిన్ననాయకుడు, ప్రతిపక్షనాయకులందరికీ తలలో నాలుకలా వ్యవహరిస్తారు. కాబట్టి కార్పొరేషన్ పరిపాలనలో ఎవరెవరో చేయి పెడుతున్నారని తిడతారు గాని కమిషనర్‌ను ఎవరూ పల్లెత్తుమాట అనరు. విషయమేమిటంటే కమిషనర్‌గారు కూడా మైక్ అనౌన్సర్ అవతారమెత్తారు. నగరంలో ఇంటిపన్ను, నీటిపన్నులు తక్షణం చెల్లించాలని గత కొన్ని రోజులుగా కార్పొరేషన్ ఆటోల్లో మైకులద్వారా ప్రచారం చేస్తుంది. ఈ ప్రచారానికి వాడుతున్న క్యాసెట్‌లో పన్నులు చెల్లించమని కోరుతున్న గొంతు మునిసిపల్ కమిషనర్ గారిదే. పబ్లిసిటీ ఖర్చులు తగ్గించను కమిషనర్ తన గొంతును అరువిచ్చారా? అత్యుత్సాహంతో ఇచ్చారా అనే విషయమై ట్రంకురోడ్డులో వాడివేడి చర్చ జరుగుతుంది.

### తెలుగుకాదు... టెలుగు

ఆంధ్రులకు భాషాభిమానం తక్కువని అందరూ అంటున్నా మనలో రోషం రాదు. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా వ్యవహరిస్తున్న కిరణ్‌కుమార్‌రెడ్డి సైతం ఇంగ్లీషు మీడియం స్కూల్ విద్యార్థి కావడం వల్ల తెలుగులో ఉపన్యాసం చేసే సమయంలో పదాల కోసం ఇబ్బంది పడుతుంటారు. ప్రభుత్వం చేపడుతున్న వివిధ పథకాలను ఇంగ్లీషులోనే వివరిస్తుంటారు. గతవారం ఆయన నెల్లూరు పర్యటనను పురస్కరించుకొని విఆర్ కాలేజిలో జరిగిన సభలో 'చప్పట్లు' కొట్టమనేదాన్ని తప్పెట్లు కొట్టమనడం... తరచుగా అనే పదానికి బదులు 'తడసు' అనేదాన్ని వాడడంపై భాషాభిమానులు గింజుకొంటున్నారు. సిఎం మంచి తెలుగు మాట్లాడడం నేర్చుకోవాలని సలహాయిస్తున్నారు. మరి నెల్లూరు అల్లుడికి ఈ విషయాలు తెలుస్తాయో... లేదో?

### సిసిల కుర్చీలాట!



నెల్లూరు డిప్యూటీ డిఇఓ పేషీలో సిసిల కుర్చీలాటతో మరోసారి విద్యాశాఖ రోడ్డున పడింది. డిప్యూటీ డిఇఓ దగ్గర సిసిగా పనిచేస్తున్న వెంకటయ్యను తప్పించి డైట్ నుంచి కొత్త వ్యక్తిని సిసిగా నియమించారు. ఈ బదలీ ఇష్టపడని వెంకటయ్య సీటు వదలడు. కొత్తగా వచ్చిన వ్యక్తి కూడా సిసిగా చేరిపోయాడు. ఇద్దరూ తామే సిసిలమని చెప్పుకొంటుండడంతో కార్యాలయానికి వెళ్లిన ఉపాధ్యాయులు ఎవరికి తమ సమస్యలు చెప్పుకోవాలో తెలియక తలపట్టుకొంటున్నారు. మహాఘటికుడని పేరుగాంచిన డిఇఓ రామలింగం కూడా విద్యాశాఖాధికారి కార్యాలయాన్ని అదుపులోనికి తేలేకపోతున్నాడు.




ఆహార సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, అనుకూల ప్రయాణాలు, బంధుమిత్రుల కలయికతో ఉల్లాసంగా వుంటారు. క్రయవిక్రయాలు అనుకూలంగా జరుగుతాయి. కళాకారులకు, ప్రముఖులకు శుభ వార్తలు అందుతాయి. విద్యార్థులకు మంచి కాలం. గతంలో చేసిన తప్పిదాలను, విశ్లేషించుకొనే పనిలో పడుతారు. చక్కని వ్యవహార జ్ఞానంతో వివిధ రంగాల్లోని వ్యక్తులను ఆకర్షిస్తారు.




జ్వరాదుల పీడ, అలర్జీ బాధలుంటాయి. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. తల్లి అనారోగ్యం చింతనిస్తుంది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. ఆదాయమార్గాలు విస్తరిస్తాయి. వ్యాపారులకు కొంతవరకు మేలు. పోటీలెక్కువ. భాగస్వాములతో జాగ్రత్త. విద్యార్థులకు చదువు సాగదు. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది. గృహిణులకు వత్తిడి ఎక్కువ.




ఆరోగ్య విషయాలలో పెద్ద ఇబ్బందులు లేకపోయినా ఊపిరితిత్తులకు, పాదాలకు సంబంధించి ఇబ్బందులుంటాయి. ఆస్మా పీడితులకు అధిక బాధ. బంధువుల మూలంగా సాయం పొందుతారు. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభప్రాప్తి వుంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖతవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు.




ఆరోగ్యవిషయాలు చక్కగా ఉంటాయి. సంతానమూలంగా మానసిక వేదనకు గురౌతారు. దైవానుగ్రహానికి ప్రయత్నం చేయండి. ధన విషయంలో తండ్రి, సోదరులతో గొడవలు రావచ్చు. ఆర్థిక విషయాలు అంతంతమాత్రమే. ఇరుగుపొరుగువారి సహాయం అందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. ఉద్యోగులకు ఎదురు చూసినవి లభించవచ్చు. విద్యార్థులకు కొంత మేలు.




కుటుంబ వ్యవహారాల్లో సంయమనం పాటిస్తే మంచి ఫలితం ఉంటుంది. తొందరపాటు వల్ల అనర్థమే తప్ప ప్రయోజనం వుండదని గ్రహించండి. బద్ధకాన్ని వదలి శ్రమ పడగలిగితే అందుకు తగిన ప్రతి ఫలం తప్పక పొందుతారు. తలకు సంబంధించిన అనారోగ్యం వచ్చే సూచనలున్నాయి. ముఖ్యులైన వ్యక్తుల్ని కలుసుకొంటారు. తద్వారా మీ పనులు చక్క దిద్దుకొంటారు.




నూతన కార్యక్రమాలకు ఉపక్రమిస్తారు. ప్రతి పనిని ప్రతిష్ఠాత్మకంగా పూర్తిచేస్తారు. కుటుంబములో అశాంతి, అసౌఖ్యం ఉన్నా ఆ పరిస్థితి తాత్కాలికమే. వృత్తి వ్యాపారాలు బలోపేత మవుతాయి. సంతానం విషయంలో జాగ్రత్త అవసరం. దైవకార్యాల నిమిత్తం డబ్బు ఖర్చు చేస్తారు. ప్రణాళికా బద్ధమైన నడవడితో ముందుకు సాగుతారు. అకారణ విరోధాలు తలెత్తే ప్రమాదం కూడా ఉంది.

# వారఫలాలు

*తేది 06-8-2011 నుండి 12-8-2011 వరకు కర్కాటకంలో రవి, శుక్రులు; సింహంలో బుధుడు; మేషంలో గురువు; మిథునంలో కుజుడు; వృషభంలో కేతువు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; తుల, వృశ్చిక, ధనుర్మకరాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

12 తేది వరలక్ష్మీవ్రతం.

**శుభ ముహూర్తాలు**

6,8,10,12 తేదీలలో సింహ లగ్నాన ఉ.7.00 నుండి 9.00గంటల వరకు. తులా లగ్నాన ఉ11.00 నుండి 01.00 గంటల వరకు సాధారణ శుభ ముహూర్తాలున్నాయి.

**జూలై తిథులు**

**శ్రావణ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 6 | శని | సప్తమి | ఉ 09.26 గం.ల.వ |
| 7 | ఆది | అష్టమి | ఉ 06.59 గం.ల.వ |
| | ఆది | నవమి | తె 04.54 గం.ల.వ |
| 8 | సోమ | దశమి | రా 02.49 గం.ల.వ |
| 9 | మంగళ | ఏకాదశి | రా 01.16 గం.ల.వ |
| 10 | బుధ | ద్వాదశి | రా 12.04 గం.ల.వ |
| 11 | గురు | త్రయోదశి | రా 11.05 గం.ల.వ |
| 12 | శుక్ర | చతుర్దశి | రా 11.12 గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ఆరోగ్యవిషయం కొంత మెరుగు. కీళ్ల బాధలుండవచ్చు. పెద్దలతో గొడవలు రావచ్చు. తల్లి అనారోగ్యం ఆందోళనకరం. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా ఉన్నా స్పెక్యులేషన్ జోలికి పోవద్దు. భాగస్వాములు మోసగించే అవకాశాలున్నాయి. ఉద్యోగులకు ప్రోత్సాహకాలు లభిస్తాయి. భూభవనాలు, వస్తువాహనాల ద్వారా ఆదాయ మార్గాలు సులభతరమవుతాయి.




కంటికి, ఊపిరితిత్తులకు సంబంధించి ఇబ్బందులు వుండవచ్చు. కళత్ర సంబంధం చక్కగా వుంటుంది. పెద్దల సాయంతో ఉద్యోగ వృద్ధి, వేతనవృద్ధి వుంటుంది. స్థిరధనాగమం ఆనందాన్నిస్తుంది. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వ్యాపారులు కొత్త సంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ.




జ్వరం, నిద్రలేమి, గొంతులో అనారోగ్య బాధలుంటాయి. పాదాలకు గాయాలు తగిలే అవకాశం. కళత్రంతో గొడవలుండవచ్చు. ధన విషయాలలో లోటు లేదు. ఋణరూపంలో కూడా ధనప్రాప్తి. ఆకస్మిక ఖర్చులు ఆవేదనను కల్గిస్తాయి. భాగస్వాములు మోసగించే అవకాశాలు న్నాయి. వ్యాపారులకు పోటీలధికం. ఆదాయం తక్కువ. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి వుండవచ్చు.




నరాల బలహీనత, ఒత్తిడి బాధలుంటాయి. కుటుంబసభ్యుల తోడ్పాటు చక్కగా వుంటుంది. అనవసరపు విషయాలలో జోక్యం చేసుకోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు బాగా తృప్తికరంగా వుంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా వుండాలి. ఉద్యోగులకు పై అధికారుల సాయం చక్కగా లభిస్తుంది.




నిద్రలేమి, జ్వరంలాంటి అనారోగ్య బాధలధికంగా వుంటాయి. గాయాల పాలయ్యే అవకాశం కలదు. ధనవిషయంలో కూడా కటకట వుండవచ్చు. తల్లి అనారోగ్యం అంతంత మాత్రమే. బంధువులతో విరోధ ప్రాప్తి. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు తగ్గుముఖం పడతాయి. ఉద్యోగులకు అతి కష్టంగా సాగుతుంది. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది.




ఆరోగ్యవిషయంలో ఒత్తిడి వల్ల, పైత్య ప్రకోపం వల్ల ఇబ్బందులు. కళత్ర సుఖం చక్కగా వుంటుంది. విందు వినోదాలలో పాల్గొంటారు. ధనవిషయంలో లోటుండదు. అయినా ఖర్చులు అనూహ్యంగా పెరుగుతాయి. స్పెక్యులేషన్ కూడా లాభిస్తుంది. భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. విద్యార్థులకు మంచికాలం.

# వాస్తు షడంగ యుక్తం... అవాస్తు సమస్యాత్మకం!

*డాక్టర్ ఎం.కౌసల్య — హైదరాబాద్*

** ఓ ఆంగ్ల గ్రంథంలో వాస్తు షడంగాలతో కూడినది అని వుంది. దయచేసి వివరించగలరా?*

వాస్తు ఆరు అంగాలతో కూడినదని అర్థం. అవి 1.అర్వణ విచారము, 2.రోధనము, 3.స్థాపనము, 4.నిర్మాణము, 5.ప్రవేశము, 6.పునర్వ్యవస్థ. ఆ గ్రంథం అగస్త్యవాస్తు దక్షిణాది వాసులు ఆచరిస్తున్నారు. నచ్చినందువల్లే ఆల్ఫ్రెడ్ లైవ్ స్టోన్ ఆంగ్లీకరించి బ్రిటన్‌లో విస్తృత ప్రచారంలోకి తెచ్చాడు.

*ఇ.ఆనందరావు — నెల్లూరు*

** తూర్పు గృహం, దక్షిణం వీధి, ఆగ్నేయం మెట్లు నిర్మాణం జరిగింది.*

దక్షిణం వైపే ఇల్లు కట్టాల్సింది. ఇప్పుడు దక్షిణం, తూర్పు దిశావాస్తులో ఏ వాస్తు పాటిస్తారు? రెండు దిశలూ భ్రష్టమై పోయాయి.

*వి.రమాకాంతరెడ్డి — చెన్నై*

** ఆగ్నేయం, వాయువ్యాల ఒత్తిడి ప్రభావం నిజమేనా?*

నిజమే. గాలి పీడనం పై రెండు దిక్కుల్లో ఉంటుంది. కాబట్టే వంట గదులకు శాస్త్రాల్లో అక్కడ స్థానం ఇచ్చారు.

*షేక్ బడేసాబ్ — నాయుడుపేట*

** స్థలాన్ని సరిచేసుకొనే విధానాన్ని చెప్పండి?*

నైరుతి మొత్తం మీద ఆరు అంగుళాలు, వాయువ్యం నాలుగు, ఆగ్నేయం మూడు అంగుళాలు ఎత్తు పెంచి ఈశాన్యాన్ని పల్లం చేయండి. నైరుతిలో తాత్కాలికంగా షెడ్డు నిర్మించండి.

*హెచ్.మేరీజాన్సన్ — నెల్లూరు*

** ఆయన ఈ ఆపద నుంచి గట్టెక్కితే చాలు. సలహా ఇవ్వండి?*

తూర్పు, పశ్చిమాలు మగవారిపై ప్రభావం చూపిస్తాయి. అక్కడి లోపాలను సవరించుకోండి. శత్రుగ్రహ స్థానం 'శని'. నీలం(ద్వితీయార్థ) ధరింపజేసి, 'వాస్తు'యంత్ర ప్రతిష్ట చేయండి.

*ఎన్.సుప్రజారెడ్డి — నెల్లూరు*

** అపార్టుమెంటు వాయువ్యం పెరిగింది. ప్లాటు ఈశాన్యం కట్ అయింది.*

బాహ్య, అంతర దోషాలున్న ప్లాట్లు కొనకపోవడమే మంచిది. తీరా కొన్నాక మీ దిశాదోషాలను బట్టి 'శీతల యంత్ర' ప్రతిష్ట కొంత నష్టాల్ని, కష్టాల్ని నివారించగలుగుతుంది.

*బి.వి.శ్రీలక్ష్మి — నెల్లూరు*

** మా ఇంటాయన ఏం చేసినా కలసి వస్తుంది. అబ్బాయి అన్ని విషయాల్లోనూ నష్టపోతున్నాడు.*

నమ్మకం వున్న వాళ్లకీ, లేని వాళ్లకీ మధ్య పరిస్థితులు ఇలాగే వుంటాయి. అతను రత్నధారణ కూడా చేయడంటున్నారు కాబట్టి గృహ రక్షణగా 'లక్ష్మీ గణపతి' యంత్ర ప్రతిష్ట చేయండి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డి.పెంచలరెడ్డి — ఆత్మకూరు*

** నైరుతిలో వంట చేస్తున్నాము. ఇంట్లో అందరికీ ఆరోగ్యం బాగా వుండదు.*

నైరుతి(రాక్షసస్థానం)లో వంట అనారోగ్యదాయకం. మీ ఇంటి ప్లానును బట్టి వాయువ్యం గది వుంది కదా దాన్ని వంటగదిని చేసుకోండి.

*జి.సుదర్శనరెడ్డి — కావలి*

** ప్లాటులో గోడల్లో కలిసి పోకుండా ఒక పిల్లర్ ప్రత్యేకంగా వచ్చింది.*

అట్లా రావడం మంచిది కాదు. 'స్తంభ వేధ'కు కారణమవుతుంది. ఇల్లు మారవలసి వుంటుంది.

*షక్రుద్దీన్ అహ్మద్ — నెల్లూరు*

** బాడుగ ఇళ్లయినా వాస్తు చూడాలా?*

ఇల్లు ఏదైనా వాస్తు చూడాలి. బాడుగ ఇల్లయితే ఏ దుష్ప్రభావాలు కలుగుతున్నాయో గుర్తించి తత్సంబంధిత యంత్ర ప్రతిష్ట చేసుకోవాలి.

*కె.ప్రసూనారెడ్డి — సికింద్రాబాద్*

** ఎంత డబ్బు సంపాదించినా స్వంత ఇల్లు లేదు. జాతకం రాయించుకోమంటారా?*

మీకు ఉత్తరం, పశ్చిమ స్థలాలు కలిసి వస్తాయి. రిజిస్ట్రేషన్ మీ వారి పేర చేయించండి.

*సి.ధనుంజయరెడ్డి — చెన్నై*

** ప్లాటులో దిక్కులు పెరిగినపుడు ఏమి చేయాలి?*

నైరుతి 'శీతల', వాయువ్యం 'సుదర్శన', ఆగ్నేయం 'నరఘోష', ఈశాన్యం 'లక్ష్మీగణపతి' యంత్ర ప్రతిష్టలు చేసుకోవాలి.

# ఆందోళన చేస్తేగాని పరిహారమివ్వరా?

**జిల్లాలో పరిశ్రమల ఏర్పాటు కోసం రైతుల నుంచి తీసుకొన్న భూములకు సరైన పరిహారం చెల్లించడం లేదు. దీంతో తోటపల్లిగూడూరు, ముత్తుకూరు మండలాల్లోని రైతులు నిత్యం ఏదో ఒక ఆందోళన చేయక తప్పడం లేదు.**

పరిశ్రమల ఏర్పాటు కోసం రైతుల నుంచి తీసుకున్న భూములకు సరైన పరిహారం చెల్లించాలనే డిమాండ్‌తో పలు గ్రామాల్లోని రైతులు ఆందోళనబాట పడుతున్నారు. ప్రధానంగా టి.పిగూడూరు, ముత్తుకూరు మండలాల్లో విద్యుత్ కేంద్రాల ఏర్పాటు జరుగుతున్నాయి. భూములు సేకరించే సమయంలో రైతులు నష్టపోకుండా వుండే విధంగా పరిహారం అందిస్తామని హామీ ఇచ్చిన రెవెన్యూ అధికారులు ఇప్పుడు మాట మారుస్తున్నారు. ఇందుకు ప్రజాప్రతినిధులు కూడా అధికారులకు మద్దతుగా మాట్లాడుతున్నారు. ప్రభుత్వం నిర్ణయించిన ధర ఆధారంగానే భూములకు పరిహారం తీసుకోవాలంటూ రైతులపై ఒత్తిడి తీసుకొస్తున్నారు.

మండల తహశీల్దార్ కార్యాలయం దగ్గర నుంచి జిల్లా కలెక్టరేట్ వరకు భూములు కోల్పోయిన రైతులు చెప్పులరిగేలా తిరుగుతున్నా అధికారులు స్పందించడం లేదు. ధర్నా, ఆందోళన కార్యక్రమాలు చేపట్టిన సమయంలో మాత్రం ఏదో ఒక హామీ ఇచ్చి తిప్పి పంపుతున్నారు అధికారులు. ముత్తుకూరు మండలం పైనాపురం గ్రామపంచాయితీ పరిధిలో గతంలో ప్రభుత్వం సీలింగ్ యాక్టుక్రింద పంపిణీ చేసిన భూముల్ని థర్మల్ పవర్‌టెక్, నెల్‌క్యాస్ట్ కంపెనీలు పవర్ ప్లాంట్ల ఏర్పాటు చేసుకొనేందుకు అప్పగించడం జరిగింది. ఇందులో ఎస్సీ కార్పొరేషన్ గత పాతికేళ్ల క్రితం నిరుద్యోగులకు పంపిణీ చేసిన భూములు కూడా వున్నాయి.ఈ భూములకు సంబంధించిన రైతులకు పరిహారం అందించేందుకు ఇప్పటికీ ఏ అధికారి కూడా కృషి చేయలేదు.

ప్రభుత్వ భూములు, సీలింగ్ భూములు, సిజెఎఫ్ఎస్ భూములు ఎన్ని కేటాయించారన్న విషయాన్ని గ్రామస్తులు తెలుసుకొనే అవకాశం లేకుండా పోయింది. సర్వే నెం.354, 355, 357, 358లలో గాయత్రి కంపెనీ లక్షా50వేల క్యూబిక్ మీటర్ల మట్టిని తీసి నిర్మాణం కోసం వినియోగించారు. ప్రభుత్వ నిబంధనల ప్రకారం గ్రామ సమీపంలో ఎట్టి పరిస్థితులలో కూడా మట్టిని తీయకూడదని గ్రామస్తులు చెబుతున్నారు. పై కంపెనీలకు కేటాయించిన మొత్తం భూములపై రీసర్వే చేయించాలని రైతులు ఎప్పటి నుంచో డిమాండ్ చేస్తున్నా రెవిన్యూ యంత్రాంగం స్పందించలేదు. భూములు సేకరించిన అధికారులు న్యాయమైన పరిహారం అందించడంతో పాటు ఉపాధి అవకాశాలు కల్పిస్తామని అప్పట్లో ప్రకటించారు.

## కలెక్టర్‌కు మొర

పైనాపురం రైతులు, గ్రామస్తులు భూములకు చెల్లించాల్సిన పరిహారం విషయమై జిల్లాకలెక్టర్ బి.శ్రీధర్, జాయింట్ కల్టెర్ సౌరభ్‌గౌర్‌లను కలిసి తమ సమస్యలను మొరపెట్టుకున్నారు. దాదాపు 50మందికిపైగా కలెక్టరేట్‌కు చేరుకుని గతంలో అధికారులు ఇచ్చిన హామీలను గుర్తు చేశారు. భూములు తీసుకోవడంతో జీవనాధారం కోల్పోయి ఇతర ప్రాంతాలకు కూలీ పనుల కోసం వలసలు వెళ్లాల్సిన దుస్థితి ఏర్పడిందని విన్నవించుకున్నారు. ఒక సందర్భంలో జాయింట్ కలెక్టర్, రైతుల మధ్య వాగ్వివాదం చోటు చేసుకుంది.

ఇదిలా వుండగా చిల్లకూరు మండలం అంకులపాటూరులో ఎస్‌బిక్యూ ఉక్కుపరిశ్రమ ఆధ్వర్యంలో పవర్‌ప్లాంటు ఏర్పాటుకు ప్రభుత్వం అనుమతిచ్చింది. గ్రామ సమీపంలోను సిజెఎఫ్ఎస్, చెరువు పోరంబోకు భూముల్ని సేకరించారు. ఇక్కడ కూడా రైతులకు సరైన పరిహారం అందించాలని ఇటీవల ఉక్కుపరిశ్రమ ఎదుట రైతులు, గ్రామస్తులు ఆందోళన చేపట్టారు. పరిశ్రమ ప్రతినిధులు రైతుల డిమాండ్‌ను ఒప్పుకోక అవసరమైతే వేరే రాష్ట్రంలో పవర్ ప్లాంట్‌ను నిర్మిస్తామని ఆగ్రహం వ్యక్తం చేశారు. రైతుల నుంచి భూములు తీసుకున్న ప్రైవేట్ పరిశ్రమ నిర్వాహకుల తీరుపై జిల్లావ్యాప్తంగా ఆందోళన చేపట్టాలని రాజకీయ పక్షాలు నిర్ణయించాయి.

స్వాహా పర్వం

- వైద్య ఆరోగ్యశాఖలో

# నిధులు స్వాహా చేసిన వారు దొరికేనా?




**జాతీయ గ్రామీణ ఆరోగ్య మిషన్ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాల్లో పారిశుధ్యం మెరుగు పరిచేందుకు మంజూరైన నిధులు స్వాహా అయ్యాయని ప్రభుత్వానికి ఫిర్యాదులు వెళ్లాయి. దీంతో ఈ వ్యవహారం పరిశీలనకు ప్రభుత్వం ఆడిటర్లను పంపింది.**

జిల్లా వైద్యఆరోగ్యశాఖ కార్యాలయంలో నిధుల దుర్వినియోగంపై ఆడిట్ చేపట్టారు. జాతీయ గ్రామీణ ఆరోగ్యమిషన్ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలలో పారిశుద్ధ్యం మెరుగుపరచేందుకు నిధులు మంజూరయ్యాయి. జిల్లాలోని అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ఆధ్వర్యంలో ఈ నిధులను ఖర్చు చేశారు. అయితే నిధుల వినియోగంపై అవినీతి, అక్రమాలు జరిగాయని ఆరోపణలున్నాయి. ఉద్యోగ సంఘాల నేతలు కూడా నిధుల దుర్వినియోగం జరిగినట్లు ప్రభుత్వానికి ఫిర్యాదు పంపారు.

వీటిపై స్పందించిన ఆశాఖ ఉన్నతాధికారులు ప్రత్యేక ఆడిట్ బృందాన్ని జిల్లాకు పంపారు. గతవారంలో నెల్లూరుకు విచ్చేసిన ఆడిట్ అధికారులు జిల్లా కార్యాలయంలోని అన్ని రికార్డులను పరిశీలించి తనిఖీ చేయడం జరిగింది. గతంలో కూడా కుటుంబ నియంత్రణ ఆపరేషన్లకు సంబంధించి లబ్దిదారులకు అందజేయాల్సిన నగదు పారితోషికాల్లో అవినీతి అక్రమాలు చోటు చేసుకున్నాయి. దాదాపు 8లక్షల రూపాయలు దుర్వినియోగం జరిగినట్లు గుర్తించారు. అయితే ఇందుకు సంబంధించిన బాధ్యులపై చర్యలు తీసుకోవడంగాని, నగదు రికవరీ చేయడం గానీ చేయలేకపోయింది ప్రభుత్వం.

జాతీయ గ్రామీణ ఆరోగ్యమిషన్ పథకం క్రింద విడుదల చేసిన నిధులు స్వాహా జరిగాయన్న ఆరోపణలు రావడం సర్వసాధారణమని ఆశాఖ ఉద్యోగులే బహిరంగంగా వ్యాఖ్యానిస్తున్నారు. సాధారణ ఆడిట్‌లో భాగంగానే తాజాగా తనిఖీలు చేశారని అంటున్నారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో విధులు నిర్వర్తించే వైద్యులు ఇతర అవసరాల కోసం పారిశుద్ధ్యం మెరుగుకోసం ఖర్చు చేయాల్సిన నిధుల్ని ప్రక్కదారి మళ్లించారన్న ప్రచారం జరుగుతోంది.

నిధుల వినియోగం సక్రమంగానే జరిగినట్లు సమర్పించిన ధృవీకరణ పత్రాలు, రశీదులు, బ్యాంకు బ్యాలెన్స్‌ల వివరాలు తనిఖీ చేశారు. ఏ ఒక్క గ్రామంలోనూ ఎన్ఆర్‌హెచ్‌ఎం నిధులతో పారిశుద్ధ్యం కార్యక్రమాలు చేపట్టలేదన్న సంగతి అందరికి తెలిసిందే. జిల్లాస్థాయి అధికారులు వీటిపై సరైన పర్యవేక్షణ చేయకపోవడం కూడా నిధుల దుర్వినియోగానికి మరో కారణంగా పేర్కొనవచ్చు. హైద్రాబాద్ నుంచి ప్రత్యేక ఆడిట్ బృందం రావడంతో అవినీతి అక్రమాలకు పాల్పడిన వైద్యుల్లో భయాందోళన మొదలైంది. తనిఖీ చేపట్టిన అధికారులు సమర్పించే నివేదికపై ఏ చర్యలు తీసుకోవాలన్నది ఆధారపడివుంది.

మరోప్రక్క రాజకీయ నేతల సహకారంతో అవసరమైతే నివేదికను తొక్కిపెట్టేందుకు, పైరవీలు చేయించుకొనేందుకు మార్గాలను అన్వేషిస్తున్నారు. గతంలో నిధుల దుర్వినియోగానికి పాల్పడిన వారిపై ఏ చర్యలు తీసుకోకపోవడంతో ఇప్పుడు కూడా అదే పరిస్థితి కొనసాగే అవకాశం లేకపోలేదని చెబుతున్నారు. ఎన్ఆర్‌హెచ్‌ఎం నిధుల దుర్వినియోగంపై జరిగిన ఆడిట్‌లో ఎవరిపై వేటు వేస్తారో వేచి చూడాలి.

## మహిళలు ఎదిగారు!



జెనీలియాకు తెలుగు సినిమాలు తగ్గాయి. రానా సరసన నాఇష్టం చిత్రంలో మాత్రమే నటిస్తుంది. షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడింది. నటిగా కాదు; ఓ మహిళగా మాట్లాడుతున్నా నేటి సమాజంలో మహిళలకు సముచిత స్థానం ఎవరో ఒకరు ఇవ్వాల్సిన అవసరం లేదు. మహిళలు ఎదిగారు. రాజకీయాలు, ఉద్యోగాలు, వ్యాపారాలు... ఎక్కడ చూసినా వాళ్లే అవకాశాలను సృష్టించుకొంటున్నారు. అయినా మహిళలు అన్ని రంగాల్లో ఇంకా ముందుకు రావాలి. ఈనాటి యువతరానికి దేన్నాయినా మార్చే శక్తి వుంది. ముఖ్యంగా అమ్మాయిలు బాగా చదువుకోవాలంది జెనీలియా.

## తగ్గిన ఇలియానా!



దక్షిణాదిలో ఒక్క సినిమాకు 1.25కోట్ల రూపాయల వరకు పారితోషికం అడిగిన హీరోయిన్‌గా ఇలియానా రికార్డు సృష్టించింది. శక్తి, నేను నా రాక్షసి చిత్రాల అపజయం తర్వాత ఇలియానాకు చిత్రాలు తగ్గాయి. దీంతో ఆమె పారితోషికం తగ్గించుకోలేక తప్ప లేదు. సినిమాకు కోటి రూపాయలతోపాటు ఇతరత్రా ఖర్చు భరించాల్సిందే అంటూ చెప్పిన ఇలియానా మేకప్, కాస్ట్యూమ్స్ ఖర్చులన్నీ కలుపుకొని ప్రస్తుతం కోటిరూపాయలే తీసుకొంటుంది. ఈ తగ్గింపు వల్లే మళ్లీ అల్లుఅర్జున్ – త్రివిక్రమ్‌ల కాంబినేషన్‌లో తీస్తున్న సినిమాలో హీరోయిన్ ఛాన్స్ ఆమెకు దక్కింది.

## కథతోనే మంచి సినిమా

కథలో ఒక పాత్రకు ప్రాధాన్యముంటే చాలదు. ముందు నలుగురిని ఆకట్టుకొనే సత్తా ఆ కథకు వుండాలి. అలాంటి కథ తెరకెక్కినప్పుడే మంచి సినిమా బయటికి వస్తుందంటుంది హీరోయిన్ అనుష్క. ఈ విషయమై మాట్లాడుతూ మీ సినిమాలో నా పాత్ర ఏమిటి? అని ఇప్పటిదాకా నేను ఏ దర్శకుడిని అడగలేదు. ముందు కథ వింటాను. ఆ తర్వాత ఒకే అంటాను. వేదం హిందీ రీమేక్‌లోనూ సరోజ పాత్ర మీరే పోషిస్తున్నారా అంటే; నేనేమి బాలీవుడ్ కలలు కనడం లేదు. కానీ కొన్ని పాత్రలు ఎన్నిసార్లు పోషించినా కొత్తగానే అనిపిస్తుంటుంది. అలాంటిదే నేను వేదంలో చేసిన సరోజ. తమిళంలో చేసినప్పుడు కూడా ఆ పాత్రను తొలిసారి పోషిస్తున్నట్లే ఫీలయ్యానంటుంది అనుష్క.



## మంచినటి అంటే చాలు



కత్తి, గగనం చిత్రాలతో తెలుగు ప్రేక్షకులకు దగ్గరైన సనాఖాన్ ప్రస్తుతం మనోజ్ సరసన మిస్టర్ నోకియా చిత్రంలో నటిస్తుంది. షూటింగ్ గ్యాప్‌లో తన ప్రాముఖ్యాలను తెలియజేసింది. బోలెడన్ని అవకాశాలు సాధించాలి, లెక్కలేనంత డబ్బు సంపాదించాలనే ఆశలేమీ నాకు లేవు. నటన అంటే నాకు ప్రాణం. ఆ ఇష్టంతోనే స్కూల్, కాలేజిల్లో జరిగిన సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొన్నా. హీరోయిన్ మాధురీ దీక్షిత్ పాటలను ఎంచుకొని వేదికపై నృత్యం చేసే దాన్ని. నేను ఇష్టపడే రంగంలో రాణించను ముందు మోడలింగ్‌లో ప్రవేశించాను. ఆతర్వాత సినీరంగంలోకి వచ్చాను. సనా ఖాన్... ఒక మంచి నటి అనిపించుకోవడమే తన ముందున్న ఏకైక లక్ష్యమంటుందామె.

## నాదారి... రహదారి



కాంచనమాల కేబుల్ టీవీ చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచయమైన హీరోయిన్ లక్ష్మీరాయ్ ఆ తర్వాత కనపడకుండాపోయింది. ఇటీవల విడుదలైన కాంచన చిత్రం ఆమెను ప్రేక్షకులకు దగ్గర చేసింది. బాలకృష్ణ సరసన ఓ చిత్రంలో నటించే అవకాశం దక్కింది. తన గూర్చి లక్ష్మీరాయ్ చెబుతూ పదిమంది వెళ్లే దారిలో నేను నడవడం నాకిష్టం వుండదు. అందుకే జీరోసైజ్ కోసం ప్రయత్నించను. అవకాశాల పరంగా సంతృప్తిగా వున్నాను. కొంత మంది నాకు అవకాశాలు రావడం లేదనుకొంటున్నారు. అందులో నిజం లేదు. తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో కలిపి ప్రస్తుతం ఆరు చిత్రాల్లో నటిస్తున్నానని చెప్పుకొచ్చింది.

# మామూలు 'సెగ' కాదు!

✍ అల్లూరు రహీం

అలా మొదలైంది, 180 చిత్రాల ద్వారా తెలుగు ప్రేక్షకులను మరీ ముఖ్యంగా యువతను ఆకట్టుకొన్న హీరోయిన్ నిత్యమీనన్. ఆమె, నాని జంటగా మనదేశం మూవీస్ పతాకంపై తెలుగు, తమిళ భాషల్లో తయారైన చిత్రం 'సెగ' పేరుకు తగ్గట్లే చూస్తున్న ప్రేక్షకులకు సెగ పుట్టిస్తుంది. తలా తోకా లేని కథనం, గబ్బు కథకు తోడు వాస్తవ జీవితాల చిత్రీకరణంటూ చేసిన ప్రచారంతో సినిమా హాళ్ల వరకు ప్రేక్షకులు వెళ్తున్నారు. అలా వెళ్లిన ప్రేక్షకులకు పిచ్చి పట్టించేస్తుంది సెగ. ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు మోసిన మహిళా దర్శకురాలు అంజన ఈ చిత్రంలో మహిళల పాత్రల చిత్రీకరణ మరీ గలీజుగా చేసింది. ఈ చిత్రంలో మెయిన్ విలన్ అమ్మాజీ ఓ మహిళ. ఆమె డెన్ నుంచి హెరాయిన్ అమ్మకాలు జరుగుతుంటాయి. చిత్రంలో సెకండ్ హీరోయిన్ బ్రోతల్. ఆమె విటులతో పడుకొంటూ కూడా తన ప్రియుడ్ని వ్యభిచార గృహానికి రప్పిస్తుంటుంది. అతను ఓ సిగరెట్ లాగించి సర్దుకపోతుంటాడు. వయసొచ్చిన మెయిన్ హీరోయిన్ తన ఇద్దరు మగ స్నేహితులతో స్కూటర్లపై బలాదూర్‌గా తిరుగుతుంటుంది. వారు బీర్ కొట్టే సమయంలో మూతలు తన నోటితోనే తీసి ఇస్తుంది. తండ్రి ముందే ప్రేమాయణం వెలగ బెడుతుంటుంది. గలీజు పాత్రలు, గబ్బు కథనంతో దర్శకురాలు సమాజానికి ఇవ్వాలనుకొన్న సందేశం ఏమిటో అర్థం కాదు. చిత్రంలో చెప్పుకోవాల్సింది ఏమైనా వుందంటే ఓంప్రకాష్ కెమెరా. సముద్రాన్ని చాలా అందంగా చూపాడాయన. మురికివాడల అందాన్ని అదే స్థాయిలో చిత్రీకరించాడు. జాషువా శ్రీధర్ సంగీతంలో మెరుపును తాకే వయసిది, వర్షం ముందుగా చరణాలతో సాగే పాటలు వినసొంపుగా వున్నా తెరపై వాటి చిత్రీకరణ బాగాలేదు.



చిత్ర కథలోనికి వెళ్తే ఒక మురికివాడలో వుండే జ్యోతి అమ్మాయిల బ్రోకర్. బాగానే గడిస్తున్నా పెళ్లాం పిల్లలను చూసుకోడు. దీన్ని భరించలేక అతని భార్య పెద్ద కొడుకు చేతులమీదుగా విషం తాగి చనిపోతుంది. అనాథలైన బాలాజీ(ముత్తుకుమార్), కార్తీక్(నాని)లను ఒక పెయింటర్ చేరదీస్తాడు. ఇతని కుమార్తె రేవతి(నిత్యమీనన్). ఆమె ఒక జెరాక్స్ షాపులో పనిచేస్తుంటుంది. ఇంజనీరింగ్ చదువుతుండే కార్తీక్‌కు విష్ణు(కార్తీక్ కుమార్) మంచి మిత్రుడు. రేవతి, కార్తీక్, విష్ణు కలసి బలాదూర్‌గా తిరుగుతుంటారు. జ్యోతి వ్యభిచార గృహంలోని వాణి(బిందుమాధవి) విష్ణును ఆకర్షిస్తుంది. మెకానిక్ షెడ్డు యజమాని అయిన విష్ణు వాణిని వ్యభిచార గృహం నుంచి విముక్తి చేయడం కోసం తన మిత్రుడు కార్తీక్‌తో కలసి హెరాయిన్‌ను యానాంకు అక్రమ రవాణా చేయను సిద్ధపడతాడు. ఈ పనిని అప్పగించిన జ్యోతి వీరిని మట్టుబెట్టమని మరో స్మగ్లర్ బాషాకు చెబుతాడు. ఈ విషయం వాణి విని విష్ణుకు ఫోన్‌చేసి చెబుతుంది. యానాం నుంచి వెనక్కు తిరిగిన విష్ణు, కార్తీక్‌ల దగ్గర హెరాయిన్ మాయమవుతుంది. విష్ణు హత్యకు గురవుతాడు. ఈ నేరంపై కార్తీక్‌ను పోలీసులు అరెస్ట్ చేస్తారు. బాలాజీ హెరాయిన్ విషయమై అమ్మాజీని కలసి మత్తు పదార్థాన్ని విష్ణు షాపులో మెయిన్ మెకానిక్ దొంగిలించి అమ్ముకొన్నాడని, పారిపోతున్న అతన్ని పట్టుకొంటే డబ్బులు దొరుకుతాయంటాడు. అమ్మాజీ మనుషులు మెయిన్ మెకానిక్‌ను పట్టుకొని చంపేస్తారు. డబ్బుతో ఆమె దగ్గరకు వస్తారు. ఈ వ్యవహారంలో జ్యోతి చేసిన తేడాను గుర్తించిన అమ్మాజీ అతన్ని చంపబోగా కార్తీక్, బాలాజీలు కలసి రక్షిస్తారు. ఆ తర్వాత అతడికి ఫుల్‌గా విషం కలిపిన మద్యాన్ని తాగించి చంపి తమ తల్లిని చంపిన కక్షను తీర్చుకొంటారు. తమ ఇంట్లో కార్తీక్ దాచిన హెరాయిన్‌ను రేవతి సముద్రంలో కలిపి వచ్చేసి అతన్ని ఆలింగనం చేసుకోవడంతో చిత్రం ముగుస్తుంది.




చిత్రంలోని నాని, నిత్యమీనన్, కార్తీక్ కుమార్, ముత్తుకుమార్‌లతోపాటు బిందుమాధవిల నుంచి పాత్రోచిత నటనను రాబట్టడంలో దర్శకురాలు విజయం సాధించినా ప్రేక్షకులు మాత్రం చిత్రంలో ఆమె పుట్టించిన సెగనుంచి కోలుకోవాలంటే ఖచ్చితంగా ఓ వారం పడుతుంది.

# నగరంలో కానరాని అభివృద్ధి!


భవనం మినహా అభివృద్ధి ఏది?

నగరంలో మునిసిపల్ పాలన గాడి తప్పుతోంది. ప్రజాప్రతినిధుల కబంధహస్తాల్లో చిక్కిన పురపాలన అన్ని రంగాల్లో విఫలమైందనే చెప్పాలి. పేరుకు కోట్ల రూపాయల నిధులు తీసుకొస్తున్నామని, పలు అభివృద్ధి పథకాలను చేపడుతున్నామని ప్రజాప్రతినిధులు, అధికారులు ప్రకటిస్తున్నా నగర పరిస్థితి మాత్రం నానాటికి అధ్వాన్నంగా మారుతోంది. నగర ప్రజలకు మౌలిక వసతులు కల్పించడం, త్రాగునీరు సక్రమంగా అందించడంలో ఘోర వైఫల్యం చెందారు. పాలకవర్గం రద్దయి ప్రత్యేకాధికారుల పాలన వచ్చినప్పటికీ కొందరు ప్రజాప్రతినిధుల కారణంగా మునిసిపాలిటీ ఏమాత్రం అభివృద్ధి చెందలేకపోతోంది. విశాలమైన రోడ్లు కరువయ్యాయి. ఎక్కడైనా కాస్తంత వెడల్పాంటి రోడ్లుంటే అక్కడ విగ్రహాలు, ఐల్యాండ్‌లు ఏర్పాటు చేసేయడంతో అది కాస్త కుంచించుకపోతోంది. పారిశుధ్యం అధ్వాన్నంగా వుంది. పలు ప్రాంతాలలో పేరుకుపోయిన చెత్త, పొంగిపొర్లుతున్న డ్రైనేజి కాలువలు దర్శనమిస్తున్నాయి. శానిటేషన్ విభాగం నిద్రావస్థలో వుంది. నెలనెలా హోటళ్లు, సినిమాహాళ్ల యాజమాన్యాల వద్ద మామూళ్ల దండుకోవడం తూతూ మంత్రంగా పరీక్షలు జరపడం తప్ప సక్రమంగా పనిచేసిన దాఖలాలు లేవు. రోడ్డు శుభ్రపరిచే వారే లేకుండా పోయారు. ఎప్పుడో ముఖ్యమంత్రి, మంత్రి, ఉన్నతస్థానాల్లో వున్న వ్యక్తులు వచ్చినప్పుడు ఆయా ప్రాంతాలను సుందరంగా ముస్తాబు చేయడం తప్ప నిత్యం రోడ్లను కేటాయించిన ప్రకారం శుభ్రపరచడం లేదు. పలు ప్రాంతాల్లో వీధిలైట్లు వెలగక చీకటి అలుముకొని వుంటున్నా పట్టించుకొనే వారే లేకుండా పోయారు. ఈ పరిస్థితుల్లో ప్రత్యేక అధికారులు చొరవ చూపి నగరపాలక సంస్థను చక్కదిద్దాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# పచ్చని చెట్లపై పగబట్టారు


హరనాథపురంలో రోడ్ల ప్రక్కన చెట్లు కొట్టేసిన దృశ్యం.

పచ్చని చెట్లు పర్యావరణాన్ని కాలుష్యం బారిన పడకుండా కాపాడుతాయి. అందుకే చెట్ల పెంపకాన్ని ప్రభుత్వం, ప్రైవేట్ సంస్థలు పెద్దఎత్తున చేపడుతుంటాయి. నగరంలో మాత్రం పచ్చని చెట్లు కన్పడితే చాలు వాటి పాలిట యమదూతల్లా వచ్చేస్తున్నారు విద్యుత్‌శాఖ సిబ్బంది. విద్యుత్ సరఫరాకు అంతరాయం అనే పేరుతో ఏపుగా, పచ్చగా పెరిగి చల్లని నీడను ఇచ్చే చెట్లను ఇష్టానుసారంగా నరికేస్తుండడంతో చాలా ప్రాంతాల్లో చెట్లు నేలకొరిగిపోతున్నాయి. ఒక్క చెట్టు పెరిగి పెద్దది కావాలంటే ఎన్నో ఏళ్లు పడుతోంది. అలాంటిది అంతరాయం అనే సాకు చూపి నిలువునా చెట్లను నరకడం ఎంతవరకు సమంజసమో ఆశాఖ అధికారులకే తెలియాలి. ఒక వైపు జిల్లాలో కాలుష్యం అధికం అవుతోంది. మరోవైపు తీరప్రాంత మండలాల్లో అధిక కాలుష్యాన్ని వెదజల్లే థర్మల్ విద్యుత్ కేంద్రాలు ఏర్పాటు కానుండడంతో పర్యావరణం దెబ్బతింటుందని, ప్రజలు ప్రమాదంలో పడకుండా వుండాలంటే చెట్లను నాటే పనిమాని వాటిని కొట్టడం విమర్శలకు దారితీస్తుంది.

# వినియోగదారుల అవగాహన సదస్సు


సదస్సులో మాట్లాడుతున్న సీతాదేవి.

నెల్లూరు దర్గామిట్టలోని భారతి వినియోగదారుల రక్షణ సమితి కార్యాలయంలో 25వ తేది వినియోగదారుల అవగాహన సదస్సు జరిగింది. వినియోగదారుల సమస్యలను చర్చించి చట్టరీత్యా తీసుకోవాల్సిన చర్యలను ప్రతిపాదించారు. ఈ సదస్సులో జిల్లా వినియోగదారుల సమాచార కేంద్రం అధ్యక్షులు వేలూరు శ్రీనివాసులు, భారతి వినియోగదారుల రక్షణ సమితి అధ్యక్షురాలు ఎ.సీతాదేవి, సంస్థ సలహాదారు ఎ.వి.నాగేశ్వరరావు, నగర వినియోగదారుల సమాఖ్య అధ్యక్షులు జయరామరాజు, కెవి.సుబ్బారెడ్డి, వాస్తు రామచంద్ర తదితరులు పాల్గొన్నారు.

# యువత భాగస్వామ్యంతోనే దేశప్రగతి!

• వెంకటేశ్వర ఇంజనీరింగ్ కాలేజి ప్రారంభోత్సవంలో కేంద్ర మంత్రి పురంధేశ్వరి


ప్రారంభోత్సవంలో పాల్గొన్న కేంద్రమంత్రులు పురంధేశ్వరి, పనబాక లక్ష్మిలతో కళాశాల ఛైర్మన్ బాబునాయుడు.

కొడవలూరు మండలం నార్తురాజుపాళెంలో ఎన్ఆర్ఐల ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన శ్రీ వెంకటేశ్వర ఇంజనీరింగ్ కళాశాల ప్రారంభోత్సవం జూలై 30వతేది జరిగింది. ఈ కార్యక్రమానికి కేంద్ర మానవ వనరులశాఖ సహాయమంత్రి దగ్గుబాటి పురంధేశ్వరి, కేంద్ర చేనేత జౌళిశాఖ సహాయ మంత్రి పనబాక లక్ష్మి హాజరయ్యారు. కళాశాలను ప్రారంభించిన అనంతరం పురంధేశ్వరి మాట్లాడుతూ గ్రామీణ ప్రాంతాల విద్యార్థులకు ఉన్నత ప్రమాణాలతో కూడిన మెరుగైన విద్యను అందించాలన్న ధ్యేయంతో ఇంజనీరింగ్ కళాశాలను ఏర్పాటు చేయడం అభినందనీయం అన్నారు. ఉన్నతాశయంతో స్థాపించిన కళాశాలను తాను ప్రారంభించడం సంతోషంగా వుందన్న ఆమె ప్రగతిలో యువత భాగస్వామ్యం కావాలని అన్నారు. దేశ సామాజిక ఆర్థిక ప్రగతికి విద్యే దోహదపడుతుందన్నారు. శ్రీ వెంకటేశ్వర ఇంజనీరింగ్ కళాశాల దినదిన ప్రవర్ధమానం చెంది జిల్లాలో మంచి కళాశాలగా ఎదగాలని పనబాకలక్ష్మి అభిలాషించారు. అనంతరం కళాశాల యాజమాన్యం ప్రకటించిన ఉచిత ల్యాప్‌టాప్‌లను విద్యార్థులందరికి ఇరువురు మంత్రులు అందించారు. ముఖ్యఅతిథులుగా హాజరైన కేంద్రమంత్రులిద్దరిని యాజమాన్యం ఘనంగా సన్మానించింది. ఛైర్మన్ పెనుబల్లి బాబునాయుడు ఆధ్వర్యంలో జరిగిన ప్రారంభోత్సవ కార్యక్రమంలో నెల్లూరు ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, కోవూరు మాజీ ఎమ్మెల్యే పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డి, కళాశాల డైరెక్టర్లు, కావలి ఆర్డీఓ వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# చేటు తెచ్చిన పాత ఎస్పీ నిర్ణయం

**లా అండ్ ఆర్డర్, క్రైం విభాగాలలో నిర్లిప్తతను సరిదిద్దిన కొత్త ఎస్పీ**

అధికారుల అనాలోచిత నిర్ణయాలు, పేరుకోసం, ఏదో చేశామని అన్పించుకొనేందుకు నిర్ణయాలు తీసుకోవడం వలన పలు ఇబ్బందులు ఎదురౌతున్నాయి. దీనికి పాత ఎస్పీ దామోదర్ ఉదాహరణ. గతంలో ఏ ఎస్పీ చేయని విధంగా నేరవిభాగం, లా అండ్ ఆర్డర్ విభాగాలను కలిసి పనిచేయాలని ఉత్తర్వులు ఇవ్వడం అప్పట్లో సంచలనం కల్గించింది. కేసులు వేగవంతంగా పరిష్కారం అయ్యేందుకని ఆయన సెలవిచ్చినా వాటి వలన ప్రయోజనం కంటే చెడే ఎక్కువ జరిగిందన్నది పలువురు అధికారులు వ్యక్తం చేస్తున్న అభిప్రాయం. లా అండ్ ఆర్డర్ పోలీసులే నేరాలపై విచారణ చేపట్టాలని ఉత్తర్వులివ్వడం వలన అసలు పని వదిలేసి కొసరుపని చేయాల్సి రావడంతో కేసులు పరిష్కారం మాట దేముడెరుగు తలకుమించిన భారం అయ్యింది ఆయా స్టేషన్ల ఎస్ఐల పరిస్థితి. శాంతి భద్రతలను పర్యవేక్షించాల్సిన ఎస్ఐలు, నేర విభాగానికి ప్రత్యేకంగా ఎస్ఐలున్నా వాటిపైనా పని చేయాల్సి రావడంతో రెండు విభాగాల మధ్య కొన్ని చోట్ల మనస్పర్థలు చోటుచేసుకొన్నాయి. అధికారులకు తమ సమస్యలు చెప్పుకోలేక, పెరిగిన పనిభారంతో ఎస్ఐలు సతమతం అయ్యారు. లా అండ్ ఆర్డర్ ఎస్ఐలు పాత ఎస్పీ జారీచేసిన ఉత్తర్వులతో నానా పాట్లు పడ్డారు. ఈ పరిస్థితులలో జిల్లాకు కొత్త ఎస్పీగా వచ్చిన రమణకుమార్ దీనిని పరిశీలించి రెండు విభాగాలను కలపడం వలన సమస్యలు తలెత్తుతున్నాయని గుర్తించారు. సాధారణంగా పనిచేస్తున్న విధంగానే లా అండ్ ఆర్డర్, నేర విభాగాలు ప్రత్యేకంగా పని చేయడమే కరెక్టని భావించి ఆ దిశగా చర్యలు చేపట్టారు. ఆగష్టు నెల నుంచి గతంలో మాదిరిగా వేటికవి వేరువేరుగా విధి నిర్వహణ చేసేలా ఉత్తర్వులను ఇవ్వడంతో ఆ శాఖలో సంతోషం వ్యక్తమయ్యింది.

## తెలంగాణ

మొదటి పేజీ కొరవ

ఎమ్మెల్యేలు, ఎమ్పీల రాజీనామాల వల్ల రాజకీయ సంక్షోభం తలెత్తకుండా తాత్కాలికంగా నీళ్లు చల్లాడు కేంద్ర నేత గులాం నబి అజాద్. చర్చలు, సంప్రదింపుల పేరిట కాలం వెళ్లదీస్తున్నాడు. అయితే దాని వల్ల రాష్ట్ర రాజకీయాలు స్థంభించి పోయాయి. ఎవరూ ఎటూ కదలలేని, మెదలలేని పరిస్థితి ఏర్పడింది. డైనమిక్ స్టేట్‌గా అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించిన ఆంధ్రప్రదేశ్‌కు ఈ దుర్గతి పట్టడం నిజంగా విచారకరం. టిఆర్ఎస్ అధినేత కెసిఆర్ చాలా తెలివిగా కాంగ్రెస్ నేతల చేతనే వారి కళ్లే పొడిపిస్తున్నాడు. బంతి వారి కోర్టులోకి విసిరి వినోదం చూస్తున్నాడు. కెకె. జానారెడ్డి వంటి నేతల అమాయకత్వాన్ని, ఆవేశాన్ని తెలివిగా వాడుకొం టున్నాడు. ఇప్పుడు ఈ నేతల పరిస్థితి కుడితిలో పడిన ఎలుకల చందంగా వుంది. రాజీనామాలు తిరస్కరించారు కాబట్టి, మళ్లీ విధులలోకి వెళ్దా మంటే, జనం కొడతారని భయం. అట్లని మళ్లీ రాజీనామాల చికాకు పెడితే అధిష్టానం ఆగ్రహి స్తుందని భీతి. అటు ఉద్యమంలో చురుకుగా పాలు పంచుకోలేక, ఇటు అధికారాన్ని అనుభవించలేక నలిగి పోతున్నారు.

### సమ్మె నగరా

పులి మీద పుట్ర వలె తెలంగాణ ఉద్యోగులు సమ్మె ప్రకటించారు. 17తేదీ నుంచి ఆ నగారా మోగుతున్నది. దాన్ని ప్రతిఘటించే మానసిక, రాజకీయ స్థైర్యం ప్రభుత్వానికి లేదు. ఆ సమ్మె కేవ లం ప్రభుత్వ ఉద్యోగులకు పరిమితం కాబోవడం లేదు. సింగరేణి గనులు, పరిశ్రమలు, పాఠశాలలు, కళాశాలలు, విశ్వవిద్యాలయాలు వంటివన్నీ సమ్మెలో భాగమని జాయింట్ యాక్షన్ కమిటీ ప్రకటిస్తున్నది. అంటే, సమ్మె అనేది మొదలైతే, తెలంగాణలో జన జీవనం స్థంభించి పోవడం ఖాయం. విద్యార్థుల తల్లితండ్రులకు ఇది మనోవేదనగా మారింది. ఆ సమ్మె ఎన్ని రోజులు నడుస్తుందో తెలియదు. అంత కాలం తమ పిల్లలకు పాఠశాలలు, కళాశాలలు లేకుండా పోతే వారికి ఒక విద్యా సంవత్సరం వృధా అయిపోతుంది. పోటీ వాతావరణంలో తమ పిల్లలు వెనుకబడిపోతారనే ఆవేదనతో మానసిక యాతన అనుభవిస్తున్నారు తల్లితండ్రులు. హైదరాబాద్ చుట్టుపక్కల ఇంజనీరింగ్ కాలేజీలలో చేరడానికి ఏ విద్యార్థీ ముందుకు రావడం లేదంటే, పరిస్థితి ఎంత విషాదకరంగా వుందో అర్థం చేసుకోవచ్చు.

సింగరేణి గనులు ఒక్కవారం పని మానివేస్తే, రాష్ట్రంలో తీవ్రమైన విద్యుత్ కొరత ఏర్పడుతుంది. ఏ థర్మల్ స్టేషన్‌లో కూడా వారం పది రోజులకు మించి బొగ్గు నిల్వలు వుండవు. మందుల కం పెనీలు, సిమెంట్ కర్మాగారాల పరిస్థితి కూడా అంతే.

### ముగింపు ఎట్లా?

కేంద్రానికి ఈ పరిస్థితులన్నీ తెలుసు. కానీ దీనికి ముగింపు ఎట్లా పలకాలో వారికి అర్థం కావడం లేదు. తెలంగాణ ఇస్తే, ఆంధ్రలో గోల రేగుతుందని భయం. మరొకప్రక్క ఇతర రాష్ట్రాలలో కూడా దాని ప్రకంపనలు వుంటాయి. నక్సలైట్ల భూతం ఒకటి వెన్నంటే వుంది. తెలంగాణ ఇవ్వ కుంటే, ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితులు చేతులు దాటి పోయే ప్రమాదం వుంది. రాజకీయంగా, శాంతి భద్రతల పరంగా కూడా ఇబ్బందులు తప్పవు. రాజ్యాంగ సంక్షోభం తలెత్తే అవకాశం వుంది. పార్లమెంట్‌లో తెలంగాణ ఎమ్పీలు సహాయ నిరాకరణ చేసినా, ప్రభుత్వానికి ఇబ్బంది కలిగేట్లు ఓటింగ్‌కు గైర్హాజరైనా చాలా ప్రమాదం. ఇప్పటికే అవినీతి కుంభకోణాల ఫలితంగా మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం చాలా బలహీనపడిపోయి వుంది. ఏ నిముషంలో అయినా బిజెపి వంటి ప్రతిపక్షాలు అవిశ్వాస తీర్మానం పెట్టవచ్చు. ప్రభుత్వం దిగి పోవాలనే నినాదాన్ని గట్టిగా విన్పిస్తున్నారు వారు. అన్నా హజారే ప్రారంభించనున్న దీక్ష ఏ మలుపులు తిరుగుతుందో తెలియదు. ప్రజలలో దాని పట్ల చాలా ఆసక్తి వుంది. మద్దతు వుంది. చిలికి చిలికి గాలివాన అయినట్లు అదొక ఈజిప్ట్ తరహా ప్రజా ఉద్యమంగా పరిణమిస్తే కొంప కొల్లేరు అవుతుంది. ఈ దశలో పార్లమెంట్‌లో తమకున్న బలాన్ని తగ్గించుకొనే ఏ చర్యకూ కేంద్రం సిద్ధంగా లేదు. తెలంగాణ ఎమ్పీలు పట్టు విడవక పోతే, తెలంగాణ ఇవ్వక తప్పని ఒత్తిడి వారి మీద పెరిగిపోతుంది. ఆ ఎమ్పీలను సమాధానపరిచే ప్రయత్నంలో గులాం నబీ అజాద్ సఫలం అయితే ఫర్వాలేదు, లేకుంటే మాత్రం తెలంగాణ ఇస్తున్న సూచనతో ఒక ప్రకటన చేయాలనే ఆలోచన కేంద్ర నాయకత్వంలో వున్నట్లు చెప్తున్నారు. రాష్ట్ర విభజన ప్రక్రియకు కొన్ని సంవత్స రాల సమయం తీసుకున్నా, విభజనకు అంగీకారం తెల్పే సంకేతం ఇవ్వడం తప్ప ఢిల్లీ దొరతనానికి వేరే మార్గం లేదని పరిశీలకుల అంచనా.

## జనవాణి

2వ పేజీ కొరవ

నిధులు తప్పుపడుతున్నారు. ఆయన లండన్ నుంచి తిరిగి వచ్చాక మళ్లీ రాజీనామా చేస్తామంటున్నారు. ఈ ప్రహసనం ఆగాలంటే రాజీనామాలను స్పీకర్ ఆమోదిస్తే సరిపోతుంది.

వాస్తు రామచంద్ర నెల్లూరు

### మా మొర ఆలకించండి!

ఎయిడెడ్ డిగ్రీ కాలేజిలలో పని చేస్తున్న అధ్యాపకేతర సిబ్బందికి వుద్యోగ విరమణ సమ యంలో ఆర్జిత సెలవును నగదుగా మార్చుకోవడా నికి వీలు కల్పిస్తూ 2009లో ప్రొసిడింగ్స్ ఇచ్చారు. దీని ఆధారంగా కాలేజి ఎడ్యుకేషన్ రీజినల్ జాయింట్ డైరక్టర్లకు తమ పరిధిలోని అన్ని కళా శాలల వారు వివరాలు పంపడం జరిగింది. 30 నెలలు గడుస్తున్నా దీనిపై ఎటువంటి చర్యలు లేవు. అప్పటి నుండి ఇప్పటివరకు ఉద్యోగ విరమణ చేసిన నాలాంటి వారెందరో వీటి కోసం ఆశ – నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతున్నారు. ఉన్నత విద్యాశాఖ కమిషనర్ ఈ విషయమై తగిన నిర్ణయం తీసుకోమని కోరుతున్నారు.

ఎ.సుధాకర్‌రావు విద్యానగర్



## సుప్రీంకోర్టుకు జగన్

16వ పేజీ కొరవ

న్యాయస్థానాల విశ్వసనీయత అనూహితంగా పెరిగి పోయింది. జనం కోర్టులను అభిమానిస్తున్నారు. ఆరాధిస్తున్నారు. కోర్టుల ద్వారా మాత్రమే రాజ కీయవాదుల దుర్మార్గాలకు అంతం జరుగుతుందని నమ్ము తున్నారు. ఆ భావనల వల్ల జగన్ అవినీతిని ఇది వరకటి వలె జనం సమర్థించడం లేదు. ఈ మార్పును జగన్ కూడా గమనించాడనే చెప్తు న్నారు. అందువల్లనే ఆయన ఈ అవినీతికి తాను, తన తండ్రి మాత్రమే కాదని, మొత్తం రాజకీయ వ్యవస్థకు ఇందులో భాగం వుందని ప్రచారం చేయడం ద్వారా ప్రజలలో తన పట్ల కలిగే వ్యతిరేక భావనలను పల్చన చేసుకోవాలన్నది ఆయన ఆలో చన.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### చక్కెరతో మచ్చిక!

రంజాన్ పండుగను పురస్కరించుకొని ముస్లింలు సేమియాలు తీయ తీయగా వండుకోను నెల్లూరు, కావలి, గూడూరులలోని రైతు బజార్లలో కిలో 30 రూపాయల లెక్కన చక్కెరను విక్రయిస్తా మని జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్ ఒక ప్రకట నలో స్పష్టం చేశారు. ఈ చక్కెరకు రేషన్ విధించక అడిగినంత ఇస్తేనే ప్రయోజనముంటుంది.

### రాజకీయాల్లో అబద్ధాలు!

గతంలో ముక్తసరిగా మాట్లాడే నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్ రెడ్డి ప్రతి విషయాన్ని కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడుతున్నారు. రాజ కీయాల్లో అన్నీ నిజాలు చెప్పలేం. ఎన్నికలన్నాక కోట్లు ఖర్చు పెడతాం. లెక్క మాత్రం లక్షల్లో చూపెడ తాం. జగన్మోహన్ రెడ్డిపై తప్పుడు కేసులు మోపి చర్యలు తీసుకొంటే ఫలితాలు తీవ్రంగా వుంటా యంటున్నారు రాజమోహన్‌రెడ్డి గారు...

### కమ్మ విద్యార్థులకు ప్రోత్సాహకాలు!

నెల్లూరులోని కాకతీయ సేవా సమితి ఈ యేడాది టెన్త్, ఇంటర్ పరీక్షల్లో 500, 900లకు పైగా మార్కులు తెచ్చుకొన్న విద్యార్థులకు ప్రోత్సా హకాలు ఇవ్వ తలపెట్టింది. అత్యధిక మార్కులు సంపాదించిన కమ్మ విద్యార్థులు తమ వివరాలు, మార్కుల లిస్టులతో సహా మక్కెన అంకయ్య చౌదరి, కార్యదర్శి కాకతీయ సేవా సమితి, 23-4-3 మెయిన్ రోడ్డు, మాగుంట లేఅవుట్, నెల్లూరు – 3 చిరునామాకు పంపమంటున్నారు సమితి అధ్యక్షులు రావిమోహన్ చౌదరి.

### జోక్స్‌పై వర్క్ షాపు

నెల్లూరు విజయమహల్ గేటు సెంటర్‌లోని శ్రీ నేతాజి పైలెట్ హైస్కూల్‌లో మురళీ ఆర్ట్స్ జోకింగ్ క్లబ్ ఆధ్వర్యంలో ఆగష్టు 1, 2 తేదీల్లో జోక్స్‌పై వర్క్‌షాపు నిర్వహించారు. 500 మంది విద్యార్థులు వర్క్‌షాపు స్ఫూర్తితో జోక్స్ సంధించారు. ముగింపు సభలో స్కూల్ అధినేత సుబ్బారెడ్డి మాట్లా డుతూ నిత్యం చదువులలో నిమగ్నమయిన విద్యార్థు లకు మానసిక ఉల్లాసానికి ఆటవిడుపుగా ఈ వర్క్ షాపు నిర్వహించినట్లు చెప్పారు. మురళీమోహన్ రావు, డాక్టర్ ఈదూరు సుధాకర్, బి.వి.నరసింహం ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### వివేకా కాదు... సోదిబాబు!

ఎవరినీ పల్లెత్తు మాట అనని నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి తనపై అవాకులు చవాకులు పేలుతున్న రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డిపై తీవ్ర స్వరంతో విరుచుకపడ్డారు. వికారపు చేష్టలు, వంకర మాటలు మాట్లాడే సోది బాబు వివేకా అని విమర్శించారు. అనవసరంగా తమపై బురదజల్లే ఆయన ఇపుడు పగటి వేషాల తోపాటు సోదిబాబు అవతారం ఎత్తాడని వ్యాఖ్యా నించారు.

### టెట్ అభ్యర్థుల అగచాట్లు

జూలై 31వ తేదీ జరిగిన ఉపాధ్యాయ అర్హత పరీక్ష(టెట్)కు హాజరైన అభ్యర్థులు పదరాని పాట్లు పడ్డారు. హాల్ టిక్కెట్లపై చిరునామాలు తప్పుల తడకగా వుండటం, ఒక సెంటర్ బదులు మరో సెంటర్ వుండటంతో చిరునామాలు వెతుక్కోడానికే అభ్యర్థులకు సమయం సరిపోక ఇబ్బందులు పడ్డారు.

### ప్రతిభా పురస్కారాలు

జిల్లా పోలీసు అధికారుల సంఘం ఆధ్వ ర్యంలో పదవ తరగతి, ఇంటర్‌లో అత్యధిక మార్కులు సాధించిన పోలీసుల పిల్లలకు ప్రతిభా పురస్కారా లను అందజేశారు. జులై 30వ తేదీ ఉమేష్‌చంద్ర సమావేశ మందిరంలో జరిగిన కార్యక్రమంలో ఎస్పీ రమణకుమార్ పాల్గొని విద్యార్థినీ విద్యార్థులకు రెండువేల రూపాయలు, సర్టిఫికేట్లను అందజేశారు. ఈ కార్యక్రమంలో సంఘ నేతలు శ్రీహరి, ప్రసాద రావు, మాధవరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### బాంబు బూచి

రైల్వే స్టేషన్‌లో బాంబు వుందంటూ పోలీ సులు తనిఖీలు చేపట్టడం కలకలం రేగింది. బాంబు వుందని సమాచారం అందుకొన్న పోలీ సులు సిఐ వీరాంజనేయరెడ్డి ఆధ్వర్యంలో రైల్వే పోలీ సులతో కలసి తనిఖీలు జరిపారు. దీంతో ప్రయా ణికులు భయభ్రాంతులకు గురయ్యారు. అనంతరం ఇదంతా మాక్ డ్రిల్‌లో భాగమని తెలుసుకొని ఊపిరి పీల్చుకొన్నారు.

### రాజరత్నం మరణం

విద్యానగర్ ఎన్.బి.కె.ఆర్ సైన్స్ అండ్ ఆర్ట్స్ కాలేజిలో 35 ఏళ్లపాటు ఆర్థిక శాస్త్రాన్ని బోధించి విద్యార్థుల అభిమానాన్ని పొందిన లెక్చరర్ డాక్టర్ ఆర్.జె.రాజరత్నం(71) జులై 27వ తేదీ నెల్లూరులో మరణించారు. రాజరత్నంకు ఆర్థిక శాస్త్రంలో ప్రావీ ణ్యాన్ని గమనించాలంటే ఆయన ఇండియన్ ఎక్స్ ప్రెస్‌లో వ్రాసిన ఇంగ్లీషు వ్యాసాలు చదవాల్సిందే. రాజరత్నంకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. వీరంతా విద్యాధికులు.

***

కోవూరు వ్యవసాయ కుటుంబికులు స్వర్గీయ పర్వతరెడ్డి శంకరరెడ్డి భార్య పర్వతరెడ్డి పార్వతమ్మ (92) 27వ తేదీ మరణించారు. ఈమెకు ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. మనుమలు, మను మరాళ్లు ఉన్నత చదువులు చదివి విదేశాలలో స్థిర పడ్డారు.

కుటుంబ పెద్దలను కోల్పోయిన పై రెండు కుటుంబాలకు మా సానుభూతి.

# చిత్ర విచిత్ర నెంబర్ ప్లేట్లు!




ఇలాంటి విచిత్రాలెన్నో.

నగరంలో వాహనాల నెంబర్ ప్లేట్లలో చిత్రవిచిత్రాలు చోటుచేసుకొంటున్నాయి. రవాణాశాఖ నియమ నిబంధనలకు అనుగుణంగా స్కూటర్లు, బైక్‌లు, కార్లు తదితర వాహనాలకు ముందు, వెనుక బాగా కన్పించేలా నెంబర్ ప్లేటును అమర్చుకో వాల్సి వుంటుంది. ఇటీవల గత కొంతకాలంగా అధికారులు పట్టించుకోకపోవడం, యజ మానుల కోరికలు వెర్రితలలు వేయడంతో చిత్రవిచిత్రంగా నెంబరుప్లేట్లు వుంటున్నాయి. పోలీసు, ప్రెస్ పేరుతో తిరిగే వాహనాలకైతే ఎలాంటి నెంబర్ వుండడం లేదు. తాటికా యంత అక్షరాలతో పోలీస్‌అని, ప్రెస్‌అని వేసుకొని నిబంధనలు ఏమీ తమకు వర్తించవ న్నట్లు ఆయా వాహనాల యజమానులు నడుపుతుండడం నిత్యం కన్పిస్తోంది. ఈ పేర్లతో వుంటే ప్రభుత్వ నియమ నిబంధనలు వర్తించవా? అనేది తేల్చాల్సి వుంది. పోలీసు శాఖలో పనిచేసే సిబ్బంది పిల్లలు, పత్రికా రంగంలో పనిచేసే వ్యక్తులు, వీటికి ఏమాత్రం సంబంధం లేకుండా ప్రింటింగ్ ప్రెస్‌లలో పని చేసే సిబ్బంది సైతం పోలీస్, ప్రెస్‌అని బోర్డు పెట్టుకొని తిరిగేస్తున్నా రవాణాశాఖ, ట్రాఫిక్ పోలీస్ అధికారులు పట్టనట్లు వ్యవ హరిస్తుండడంతో ఇలాంటివి అధికం అవుతున్నాయి. ఇటీవల ఎస్పీ రమణకుమార్ ఆత్మ కూరు బస్టాండ్ వద్ద పోలీస్ బోర్డు పెట్టుకొని వెళ్తున్న కారుని పట్టుకొన్నారు. అలాంటి బోర్డులతో నెంబర్ ప్లేటు లేకుండా వెళ్లే వాహనాలపై చర్యలు తీసుకోవాలని సిబ్బందిని ఆదేశించినా వారిలో ఏమాత్రం చలనం రావడం లేదు.

# ఆరోగ్యశ్రీకి ఆంక్షలు

కొన్ని ఆపరేషన్ల నుంచి మినహాయింపు

పేద ప్రజలకు కార్పొరేట్ వైద్యశాలల్లో ఉచిత వైద్య చికిత్సలకు బ్రేక్‌పడ నుంది. ఆరోగ్యశ్రీ పథకం నుంచి కొన్ని వ్యాధులను రాష్ట్రప్రభుత్వం తొలగిం చింది. చిన్నచిన్న శస్త్రచికిత్సలు అవసరం లేకున్నప్పటికి కార్పొరేట్ ఆసుపత్రుల్లో చేస్తూ వేలాది రూపాయిలు బిల్లులు పొందుతున్న వైనంపై ఆరోగ్యశ్రీ ట్రస్టు స్పందించింది. అపెండిసైటీస్ వ్యాధికి శస్త్రచికిత్సలు చేస్తుంటారు. అయితే కొన్ని సందర్భాల్లో అవసరం వున్నా లేకున్నా బిల్లుల కోసం వైద్యులు ఆపరేషన్‌లు చేసేస్తున్నారు. రాష్ట్రవ్యాప్తంగా 2010-11 సంవత్సరంలో ఇటువంటి కేసులు అధికం అయ్యాయి. అపెండిసైటీస్ కేసులు ప్రైవేట్ ఆసుపత్రులకు వస్తే ప్రభుత్వ ఆసుపత్రులకు పంపాలని ఆరోగ్య మిత్రలను ఆదేశించింది ప్రభుత్వం. దీంతో పాటు మరికొన్ని వ్యాధులను కూడా ఆరోగ్యశ్రీ ట్రస్టు జాబితా నుంచి తొలగిం చింది. ఈ మేరకు జిల్లాలోని ఆరోగ్యశ్రీ పథకం వర్తింపచేసే అన్ని ప్రైవేట్ ఆసు పత్రుల యాజమాన్యాలకు ఉత్తర్వులు అందనున్నాయి.

# స్మార్ట్ కార్డులతో ఇబ్బంది

## పెన్షన్ల కోసం ఎదురుచూపు

వృద్ధాప్య, వితంతు, వికలాంగులకు పెన్షన్లు ఇచ్చేందుకు జారీచేసిన స్మార్టు కార్డులతో ఇబ్బందులేర్పడుతున్నాయి. కార్డులను పొందిన లబ్ధిదారులకు పెన్షన్లు సక్రమంగా అందడం లేదు. స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైద్రాబాద్ ఆధ్వర్యంలో స్మార్టుకా ర్డులు జారీ చేయడం జరిగింది. ఈ కార్డుల్ని ఉపయోగించే మిషన్ తరచూ మొరాయిస్తుండడం, సాంకేతిక పరిజ్ఞానంపై సిబ్బందికి అవగాహన లేకపోవ డంతో రోజుల తరబడి పెన్షన్ అందించలేకపోతున్నారు. గతంలో ఇందిర క్రాంతి పథం సిబ్బంది పర్యవేక్షణలో పెన్షన్లు పంపిణీ జరిగేది. ఈ పంపిణీలో పలు అక్ర మాలు చోటుచేసుకోవడంతో రాష్ట్రప్రభుత్వం స్మార్టు కార్డుల్ని ప్రవేశపెట్టింది. ఈ కార్డుల ఆధారంగా లబ్ధిదారుల వ్రేలిముద్రలు తీసుకొని సరిపోల్చుకొన్న తర్వాతనే పెన్షన్లు ఇవ్వాల్సుంటుంది. మిషన్‌లో కార్డును ప్రవేశపెట్టిన అనంతరం వ్రేలిము ద్రలు నిర్ధారించే సమయంలో మిషన్ పనిచేయడం మానేస్తుంది. దీంతో పెన్షన్ పొందలేని వారు మండల కార్యాలయం చుట్టూ తిరగక తప్పడం లేదు.

# అబ్దుల్ అజీజ్ ట్రస్ట్ సాయం

నెల్లూరు హరనాధపురం కేంద్రంగా పనిచేసే హాజీ అబ్దుల్ అజీజ్ చారిటబుల్ ట్రస్ట్ నేతృత్వంలో జూలై 28వతేది సంతపేట లోని అండాళమ్మ మున్సిపల్ ఎలిమెంటరీ స్కూల్‌లోని పిల్లలకు అన్నం తినేప్లేట్లు, గ్లాసు లను ట్రస్ట్ ఛైర్మన్ అబ్దుల్ అజీజ్ పంపిణీ చేశారు. 160 మంది పిల్లలు వీటిని అందు కొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లా



పిల్లలకు ప్లేట్లు, గ్లాసులు పంపిణీ చేస్తున్న అజీజ్.

డుతూ మునిసిపల్ స్కూళ్లలో కనీస సౌక ర్యాలైన మంచినీళ్లు, మరుగుదొడ్లు లేకపోవ డంపై ఆవేదన వ్యక్తం చేశారు. ఎన్ని ప్రభు త్వాలు మారినా ఈ సౌకర్యాలు ఎందుకు కల్పించడం లేదో ఆత్మవిమర్శ చేసుకోవాల న్నారు. మహమ్మద్ రవూఫ్, యబ్దానీ, ఇలి యాజ్, మునీర్, శంకర్, ప్రభాకర్, విజయ, కరీం తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొ న్నారు.

# సీమాంక్ సెంటర్లలో సేవలు మృగ్యం!

**మాతా శిశు సంరక్షణ కోసం ఏర్పాటైన సీమాంక్ కేంద్రాలు వైద్యసేవలు అందించడంలో ఘోరంగా విఫలమయ్యాయి. 24 గంటలు వైద్యం అందుబాటులో వుండాల్సిన ఈ కేంద్రాల్లో నామమాత్రంగా కూడా వైద్యం అందడం లేదు.**



మాతా, శిశు సంరక్షణ కోసం ఏర్పాటైన సీమాంక్ కేంద్రాలు వైద్యసేవలను అందించడంలో ఘోరంగా విఫలమయ్యాయి. రాష్ట్ర ప్రభుత్వం సదుద్దేశంతో జిల్లాలో ఏర్పాటుచేసిన ఈ కేంద్రాలు నేడు దేనికి కొరకాకుండా పోతున్నాయి. గ్రామీణ, మారుమూల ప్రాం తాల్లో వైద్యసేవలు పూర్తిస్థాయిలో అందని కారణంగా శిశువులు, తల్లులు ప్రాణాలు కోల్పోతున్నారని భావించిన ప్రభుత్వం దానిని నివారించేందుకు మాతా శిశు సంరక్షణ (సీమాంక్) కేంద్రాలను 2006వ సంవత్సరంలో రాష్ట్రవ్యాప్తంగా ఏర్పాటు చేసింది. ప్రస వం తర్వాత మాతా, శిశువుల సంరక్షణను చూడడం ఈ కేంద్రాల ప్రధాన విధి. అందుకోసం మార్గదర్శకాలను రూపొందించారు. నిధుల కేటాయింపు జరిగింది. ప్రాథమిక ఆరోగ్యకేంద్రాల పరిధిలో 30 పడకల ఆస్పత్రులను సీమాంక్ కేంద్రాలుగా ఏర్పాటు చేశారు. ఇవి గర్భిణులకు 24గంటలు అందుబాటులో వుండేలా చూడ డంతో వీటికి 24గంటల ఆస్పత్రులని పేరొచ్చింది.

జిల్లాలో ఆత్మకూరు, గూడూరు, కావలి, సూళ్లూరుపేట, ఉద యగిరి, కోట, వెంకటగిరి తదితర ప్రాంతాల్లో సీమాంక్ కేంద్రా లను ఏర్పాటుచేసి వాటికి నూతన భవనాలను నిర్మించారు. చుట్టు ప్రక్కల వుండే పిహెచ్‌సి, ఏరియా ఆస్పత్రులకు ఈ కేంద్రాలతో అనుసంధానం చేశారు. ఈ కేంద్రాల ద్వారా మాతా, శిశువుల మర ణాలను తగ్గించేందుకు మూడుదశల్లో వైద్యసేవలు అందేలా ప్రణా ళిక రూపొందించారు. ఆయా ప్రాంతాల్లోని ఆరునెలల గర్భవతు లను గుర్తించి వారిని గైనకాలజిస్టు వద్ద పరీక్ష చేయించుకొనేలా చూడడంతోపాటు వారికి మామూలు కాన్పు అవుతుందా? కష్టత రమా? అనే విషయాన్ని గుర్తించి గర్భిణులకు అవగాహన కల్పిం చాలి. సాధారణ కాన్పు అయితే దగ్గర్లోని పిహెచ్‌సిలకు తీసుకెళ్ల డం, లేదంటే సీమాంక్ కేంద్రాల్లో ఆపరేషన్ చేయడం, కష్టతరమ నుకుంటే జిల్లా ప్రభుత్వ ఆస్పత్రికి తరలించడం చేయాలి. ఇది సీమాంక్ కేంద్రాల సిబ్బంది విధి. ఇక్కడకు వచ్చే రోగులకు అందు బాటులో వుండేందుకు గైనకాలజిస్టు, చిన్నపిల్లల వైద్యనిపుణుడు, మత్తుడాక్టర్ తదితర వైద్య సిబ్బందిని ఏర్పాటు చేశారు. మొదట్లో ఐఎంఎ సహకారంతో ప్రతి బుధవారం ఆయా కేంద్రాలకు వెళ్లి వైద్యసేవలు అందించేందుకు ప్రైవేట్ వైద్యులను నియమించారు. వీరికి కొంతమొత్తం చెల్లించేవారు. తర్వాత కాలంలో వీరిని తొల గించి ప్రభుత్వ వైద్యులను నియమిస్తున్నట్లు ప్రకటించింది ప్రభు త్వం. అయితే తగినంత వైద్య సిబ్బంది లేకపోవడం, సకాలంలో గర్భిణులకు అందుబాటులో వుండకపోవడంతో మాతా, శిశువుల సంరక్షణ కోసం ఏర్పాటుచేసిన ఈ కేంద్రాలు నిరుపయోగంగా మారాయి. లక్షల రూపాయిలు వెచ్చించి నిర్మించిన భవనాలు దిష్టి బొమ్మల్లా మారాయి తప్ప గ్రామీణప్రాంత ప్రజలకు ఎందుకూ ఉప యోగపడని స్థితికి చేరుకొన్నాయి. తగినంత సిబ్బందిని నియమిం చకపోవడం, సమన్వయం కొరవడడం, అధికారుల పర్యవేక్షణ లేక పోవడంతో ప్రభుత్వ ఉద్దేశం నెరవేరకుండాపోతోంది. జిల్లా అధి కారుల పర్యవేక్షణ నుంచి క్లస్టర్ అధికారుల చేతుల్లోకి పోవడంతో వైద్యులు, అధికారుల మధ్య సీనియారిటీ సమస్య ఉత్పన్నమై సమ న్వయం కొరవడడం మరో కారణం. మొత్తం మీద సీమాంక్ సెం టర్లు పేరు ఘనం సేవలు పూజ్యం అన్న చందంగా మారాయి.

# సంక్షేమ పథకాల అమలుపై చింతా రుసరుస!




విజిలెన్స్ అండ్ మానిటరింగ్ కమిటీ సమీక్షా సమావేశంలో తిరుపతి ఎమ్పీ చింతామోహన్. ప్రక్కన జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి, డిఆర్‌డిఏ పిడి విజయచందర్.

సంక్షేమ పథకాల అమలుపై తిరుపతి పార్లమెంటు సభ్యులు చింతా మోహన్ అసంతృప్తి వ్యక్తం చేశారు. జూలై 28వతేది జరిగిన విజిలెన్స్, మాని టరింగ్ కమిటీ సమీక్షా సమావేశానికి ఎమ్పీ అధ్యక్షత వహించారు. ఈ సమీక్షా సమావేశానికి వివిధ శాఖల అధికారులు హాజరైనారు. కేంద్ర, రాష్ట్ర ప్రభు త్వాల నిధులతో చేపడుతున్న వివిధ పథకాలు సక్రమంగా అమలు లేకపోవ డంపై పలుశాఖలకు చెందిన అధికారులను ప్రశ్నించారు. అభివృద్ధి కార్యక్ర మాల పనులు కేవలం కాగితాల్లో నమోదు చేసి చూపిస్తే సరిపోదన్నారు. వాస్త వాలకు దగ్గరగా వుండే విధంగా అధికారులు పని చేయాలని కోరారు.

అనేక పర్యాయాలు సంక్షేమ పథకాల తీరుతెన్నుల గురించి పరిశీలించి లబ్ధిదారులతో మాట్లాడటం జరిగిందన్నారు. వున్న నిధుల్ని సక్రమంగా వినియో గించాలని సూచించారు. ఇక నుంచి ప్రతి మూడునెలల కోసారి విజిలెన్స్, మానిటరింగ్ కమిటి సమావేశం జరుగుతుందని చెప్పారు. చింతామోహన్ ఆధ్వర్యంలో తొలిసారి నిర్వహించిన సమావేశానికి పూర్తి నివేదికలతో అధికా రులు రాలేకపోయారు. ఒక్కసారిగా ప్రశ్నల వర్షం కురిపించడంతో పలువురు అధికారులు ఖంగుతినాల్సి వచ్చింది.

# సుప్రీంకోర్టుకు జగన్!

జగన్ అక్రమ ఆస్తుల కేసు తుది దశకు చేరుకొన్నది. బహుశా ఈ పత్రిక పాఠకులకు చేరేసరికి, తీర్పు కూడా వెలువడే అవకాశం వుంది. ఈ కేసును అత్యవసర ప్రాతిపదిక మీద నడిపిస్తున్నది హైకోర్టు. వాయిదాలు, కాలయాపన లేకుండా ప్రతి దినం విచారణ జరిపి, త్వరగా ఒక ముగింపు ఇవ్వాలన్న ప్రయత్నం కన్పడుతున్నది. దానికి వున్న రాజకీయ ప్రాధాన్యత, ప్రజలలో రేకెత్తుతున్న ఆసక్తి దృష్ట్యా అది సముచిత నిర్ణయం కూడా.

తన తండ్రి అవినీతి వల్ల తాను జైలుకు వెళ్లవలసిన పరిస్థితే ఏర్పడితే, అందులో ఆనాడు భాగం పంచుకొన్న మంత్రులు, అధికారులు కూడా తనతోపాటు జైలుకు రావాలని జగన్ భావిస్తున్నట్లు గత వారం చెప్పాము. ఈ వారంలో ఆయన తరఫున హైకోర్టులో హాజరైన న్యాయవాదులందరూ ఈ వాదనే విన్పించారు. జగన్‌తో పాటుగా మంత్రులు, ఐఎఎస్ అధికారుల మీద కూడా దర్యాప్తు జరిపించాలని గట్టిగా వాదించారు. దీన్నిబట్టి అర్ధమయ్యేది ఒక్కటే. తన తప్పులు తప్పించుకోలేనివనే నిశ్చయానికి జగన్ వచ్చాడని దీని భావంగా చెప్పడం తప్పుకాదు. సిబిఐ దర్యాప్తుకు, జైలుకు వెళ్లడానికి ఆయన మానసికంగా సిద్ధమైనట్లు ముందు నుంచి అనుకొంటున్నదే. అయితే కేసు ఆ దశకు రావడానికి కొన్ని నెలల కాలం పడుతుంది. ఒకవేళ హైకోర్టు తీర్పు సిబిఐ పూర్తిస్థాయి దర్యాప్తుకు అనుకూలంగా వచ్చినా, ఎఫ్ఐఆర్ దాఖలు చేసి, ఆధారాలు సేకరించి, జగన్‌ను ఇంటరాగేట్ చేసే దశకు చేరుకోవాలంటే కనీసం నాలుగైదు నెలల కాలం పడుతుంది. ఆ తర్వాత మాత్రమే అరెస్టు, జైలు అవసరమా లేదా అన్నది నిర్ణయమౌతాయి. అయితే ఈ లోగా జగన్ ఆస్తులను జప్తు చేయడం వంటి చర్యలు చేపట్టే అవకాశం వుంది.

## న్యాయనిపుణులతో చర్చలు

అయితే తనను జైలుకు పంపించడం అంత సులభం కాదని జగన్ భావిస్తున్నాడు. ఢిల్లీలోని ప్రఖ్యాత న్యాయ నిపుణులందరితో విస్తృత చర్చలు జరిపిన తర్వాత ఆయనలో ధైర్యం పెరిగింది. తను చేశానంటున్న నేరాలన్నీ ఆర్థికపరమైనవి కాబట్టి, ఆస్తులు జప్తు చేయడం, భారీ జరిమానాలు విధించడం తప్ప జైలుకు పంపలేరని ఒక రాజ్యాంగ నిపుణుడు చెప్పాడట. కానీ మారిషస్ దేశం నుంచి తరలించిన వందల కోట్ల రూపాయల నిధులలో హవాలా లావాదేవీ దొరికినా, తనకు ముడుపులు ముట్ట చెప్పిన పారిశ్రామికవేత్తలలో ఎవరో ఒకరు తమను జగన్ బలవంత పెట్టి, వసూలు చేశాడని వాగ్మూలం ఇచ్చినా కేసు క్రిమినల్ చట్టాల పరిధిలోకి వెళ్లి పోతుంది. అప్పుడు ఏ న్యాయ నిపుణుడూ ఏమీ చేయలేడు. ఏది ఏమైనా, ఈ విషయంలో సుప్రీంకోర్టుకు వెళ్లడానికి సిద్ధమౌతున్నాడు జగన్.

మరొకప్రక్క సిబిఐ ఎఫ్ఐఆర్ నమోదు చేసే సమయం నుంచి అరెస్టు జరిగే వరకు జనం మధ్యలోనే వుండడం మంచిదని కొందరు ఆయనకు సూచించారట. అందువల్ల ఆ సమయానికి ఓదార్పు యాత్రలో నిమగ్నమయ్యేటట్లు కార్యక్రమం రూపొందించుకొంటున్నాడు. వారం పది రోజుల లోపలే చిత్తూరు జిల్లా నుంచి దీనికి శ్రీకారం చుట్టాలని, అక్కడ నుంచి కనీసం జనవరి నెల వరకు ఈ యాత్రలను కొనసాగించాలని భావిస్తున్నాడు.

అయితే అన్ని రాజకీయ పార్టీల వలెనే, జగన్‌ను కూడా తెలంగాణ ఉద్యమం భయపెడుతున్నది. మొదట అనుకొన్న ప్రకారం కర్నూలు ఓదార్పు యాత్ర ముగియగానే, ఆయన మహబూబ్‌నగర్ జిల్లాలో ప్రవేశించాలి. అయితే ఈ సమయంలో ఆ ప్రాంతానికి వెళ్తే, ప్రజలు తెలంగాణ విషయంలో తన వైఖరి ప్రకటించాలని ఒత్తిడి చేసే ప్రమాదం వుందని భయపడి ఆ కార్యక్రమం వాయిదా వేసుకొన్నాడు. లేకుంటే మహబూబ్‌నగర్‌తో మొదలు పెట్టి, తెలంగాణ అంతా తిరగడానికి కనీసం ఆరు నెలల వ్యవధి పడుతుంది కాబట్టి, సిబిఐని జనం మధ్య నుంచే ఎదుర్కోవచ్చునని భావించాడు. తెలంగాణ ఉద్యమం ప్రభావం ఆ వ్యూహాన్ని నీరు గార్చింది.

## జగన్‌లో మార్పు

జగన్‌ది అక్రమ సంపాదన అన్న నిజం జనానికి బాగా తెలుసు. కానీ ఇంతకాలం జనం దాన్ని పట్టించుకోలేదు. రాజకీయాలలో తినని వాడు ఎవడు అన్న వాదనతో జనం అవినీతిని సమర్ధిస్తూ వచ్చారు ప్రజలు. రాజశేఖర్‌రెడ్డి వివిధ పథకాల ద్వారా తమకు చేసిన మేలుతో పోల్చినప్పుడు ఈ అవినీతి పెద్ద లెక్కలోకి రాదనే భావన వుండింది. అందువల్లనే జగన్ కడప ఉప ఎన్నికలలో అంత భారీ మెజార్టీతో గెలిచాడు. అయితే హైకోర్టులో విచారణ తర్వాత ప్రజలలోని ఒక వర్గం కొంత పునరాలోచనలో పడినట్లు వార్తలొస్తున్నాయి. రాజకీయ పార్టీలు, ప్రతిపక్షాలు, పత్రికలు ఆరోపణలు చేయడం వేరు. న్యాయస్థానాలు, సిబిఐ నిర్ధారణలు వేరు కావడమే అందుకు కారణం. అందులోనూ 2జి స్పెక్ట్రం స్కాం తర్వాత

కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్

పాఠశాల
'మా తెలుగు తల్లి' పాట ఉన్న పేజీలను చించేయాలి.
హరీష్ రావ్
హరీష్
నందు

పుస్తకాల్లో ఎక్కడా తెలంగాణ యాస లేదని...
పుస్తకాలు మొత్తం చించేయమనరు కదా?

# సభా సంఘం ఏమైంది?

వైఎస్.రాజశేఖర్‌రెడ్డి హయాంలో జరిపిన భూ కేటాయింపుల మీద విచారణ జరపడానికి మొన్న మార్చి నెలలో శాసనసభా సంఘాన్ని నియమించారు. ఎంతో చర్చ, ఇంకెంతో ప్రచార ఆర్భాటంతో తీసుకొన్న నిర్ణయమిది. కానీ నాలుగు నెలలు గడిచిపోతున్నా దాని పని ప్రారంభం కాలేదు. కనీసం సంఘంలో సభ్యులు ఎవరన్న నిర్ణయం కూడా జరగలేదు. సంఘం ఏర్పాటుకే ఇన్ని నెలలు పడితే, ఇక అది పని ప్రారంభించేది ఎప్పుడు, విచారణ కోసం సమావేశాలు జరిపేదెప్పుడు, అందుకెంత కాలం పడుతుంది? శాసనసభ కమిటీల పట్ల ఇంత అలసత్వం ప్రదర్శించడం, అనాసక్తంగా రోజులు వెళ్లదీయడం ప్రజాస్వామ్యానికి క్షేమం కాదు. తమ సభను తామే అవమానించుకొనే దుష్ట సాంప్రదాయానికి నాంది పలుకుతున్నారు స్పీకర్, ముఖ్యమంత్రి, ప్రతిపక్ష నేతలు ముగ్గురూ. శాసనసభలో సభా సంఘాల నియామకం చాలా అరుదుగా జరుగుతుంది. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వీటిపట్ల వ్యతిరేకత చూపేవాడు. సభా సంఘాల వల్ల కలిగే మేలు కంటే జరిగే కీడు ఎక్కువ అన్నది ఆయన అభిప్రాయం. అందువల్లనే ఓబుళాపురం గనుల కుంభకోణం చర్చకు వచ్చినప్పుడు, సభా సంఘం కాకుండా, సభ తరఫున ఒక ప్రతినిధి బృందాన్ని మాత్రమే పంపడానికి అంగీకరించాడు. అయితే విస్తృత రాజకీయ అవినీతి ఇమిడి వున్న చోట సభా సంఘాలు ఎంతగానో ఉపయోగపడతాయి. ఎసిబి, సిఐడి వంటి దర్యాప్తులకు న్యాయపరమైన చిక్కులుంటాయి కాబట్టి అలస్యం జరిగే అవకాశం వుంది. కానీ సభా సంఘాలలో కోర్టులు జోక్యం చేసుకోలేవు కాబట్టి, దర్యాప్తును సాఫీగా సాగించవచ్చు. ఎసిబి, సిఐడి వంటి సంస్థలను తన అదుపులో వుంచుకొని మరీ దర్యాప్తు జరిపే అధికారం సభా సంఘాలకు వుంటుంది. అధికారులు కూడా సభా సంఘం అడిగిన ఏ ఫైల్ అయినా తెచ్చి చూపక తప్పదు. అందుకోసమే రాజ్యాంగ నిర్మాతలు చట్టసభలకు ఇటువంటి విస్తృత అధికారాలు కట్టబెట్టారు. ఆ రాజ్యాంగ స్ఫూర్తి హేళన చేసే రీతిలో సభా సంఘాలను నిర్వీర్యం చేయడం దురదృష్టకరం. ఇప్పటికైనా స్పీకర్ నాదెండ్ల మనోహర్ ఈ అపసవ్యాన్ని సరిదిద్దుతాడని ఆశిద్దాము.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com